అభినందనలు సిక్సర్

# 'సినీ హీరో పోటీ' విజేతలకు

**మొదటి బహుమతి** అప్పారపు జనార్ధనం, బియస్ సి
కంగటి వీధి, పార్వతీపురం-532 501 శ్రీకాకుళం జిల్లా.



ఆల్విన్ రిఫ్రిజిరేటరు (165 లీ)

**రెండవ బహుమతులు** 1 చింటు, కేరాఫ్ యస్ విద్యానాయుడు
12-1-17, గంజి పేట, అప్సర హోటలు వద్ద, విశాఖపట్నం

2 వి ఆదిశేషయ్య
కల్పలత షోరూమ్, 14/256, కాపువీధి, ఏలూరు

3 యం గౌరికుమార్, బియస్ సి, బి యిడి
కేరాఫ్ యం చంద్రమౌళి, గోలా వీధి, తిరుపతి-517 501

**మూడవ బహుమతులు** 1 కొమ్మన ఆనందరావు
సైకిల్ షాప్, ఆర్ టి సి బస్‌స్టాండ్ వద్ద, ఏలూరు



మెరిట్ చేతికుట్టు మిషన్లు.

2 చెట్టి అనంతరావు
కెల్లవీధి, శ్రీకాకుళం 532 001

3 గా వసుధ, కేరాఫ్ జి కస్తూరిపిళ్లె
నేతాజి రోడ్, కోట పోస్ట్, గూడూరు (నెల్లూరు జిల్లా)

4 జి వి ప్రసాద్
30-15-26, దాబా గార్డెన్స్, విశాఖపట్నం-530 004

5 ప్రశాంతి, కేరాఫ్: టి విశ్వేశ్వరన్
28-9-38ఎ, మెట్టవీధి, సూర్యాబాగ్, విశాఖపట్నం



ప్రెస్టీజ్ ప్రెషర్ కుక్కర్లు.

6 కె అప్పిరెడ్డి, కేరాఫ్ సిగరెట్స్ కంపెని
మానేపల్లి గంగయ్య బిల్డింగ్స్, తాడేపల్లిగూడెం

సరియైన సమాధానములు పంపిన మొదటి నూరు ఎంట్రిదార్లకు మరియు
కన్సొలేషన్ బహుమతి పొందిన వారికి, పోస్టుద్వారా ప్రత్యేకముగా తెలియపరచెదము.

సరైన సమాధానము.

| ఫోటో నం. | చిత్రం పేరు | ఫోటో నం. | చిత్రం పేరు |
|---|---|---|---|
| 1. | సతీసావిత్రి | 4. | శ్రీకృష్ణ విజయం |
| 2. | సత్యహరిశ్చంద్ర | 5. | శ్రీ కృష్ణ విజయం |
| 3. | ఉమా చండీ గౌరీ శంకరుల కథ | 6. | ఉమాచండీగౌరీశంకరుల కథ |




సిక్సర్
తెస్తుంది తెలుపు బట్టలకు మెరుపు

## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

*దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు*

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938–1972]

శుక్రవారం : 15–9–'78

కాలయుక్తి నామ సం॥ భాద్రపద బ॥ చతుర్థి

*సంపుటము 72 : సంచిక 1*

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60

ఆరు మాసాల చందా రు. 20-80

విడి ప్రతి వెల 75 పైసలు

**ఆంధ్రపత్రిక కార్యాలయము**

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ : శ్రీ విష్ణు తక్కరుడు (చిత్రం : ... రావ్)




# ఉత్తరాలు

## సినిమా

నటి వై. విజయ ముఖచిత్రంతో వెలువడిన మీ పత్రిక అందాలు విరజిమ్ముతూ మావద్దకు చేరింది. కథలు రెండూ చాలాబాగున్నాయ్, మోహనరూప, రాగద్వేషాలు ఒకదానికొకటి పోటీ పడినట్లున్నాయ్. సీరియల్స్ ఎంపికలో మీకు మీరే సాటని రాగద్వేషాలు సీరియల్ నిరూపిస్తుంది. మీ (మా) పత్రికలో అన్నిటికంటె జి.వి.జి పేజీ చాలా ఇంటరెస్టుగా ఉంటుంది. ఇతర పత్రికలలో ఇవ్వని ఎన్నో సినిమా విశేషాలు మీ పత్రికలో ఇచ్చి మాలాంటి సినిమా పిచ్చిగల పాఠకులను సంతృప్తిపరుస్తున్న మీ పత్రిక గురించి తిరిగి మంగళవారము ఎప్పుడొస్తుందా అని నిరీక్షిస్తూ ఉంటాము.

రవిచంద్రశేఖర్, రమణ, శ్రీనివాస్,
శ్యామసుందర్, (ఖర్గపూర్-4)

## శీర్షికలు

నటి సత్యప్రియ ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో మీరు ప్రవేశపెట్టిన "వైద్యులో వరదాలు" శీర్షిక ముఖ్యోద్దేశ్యం తప్పక నెరవేరుతుందనడంలో ఎటువంటి అతిశయోక్తి లేదు. అగ్నేయ వాయువ్యాల్లాంటి "ధర్మపథం" "వైద్యులో వరదాలు" శీర్షికలు నిర్వహించి అన్ని వర్గాల పాఠకులను అలరింపడంలో మీరు చేస్తున్న కృషి బహుధా శ్లాఘనీయం. మామూలు శీర్షికలతోపాటు మీరు ప్రచురిస్తున్న అధునాతన వైజ్ఞానిక విశేషాలు ("సముద్ర గర్భంలో మరమనుషులు" లాంటివి) పాఠకులలో వైజ్ఞానిక ప్రవృత్తిని పెంపొందింప చేయడంలో నిస్సందేహంగ సహాయపడ్తాయి.

తుమ్మల పాండురంగారావు పద్మలలిత.
(గొడాలి.)

# మనలో మాట

పిల్లలికి పెద్దలకి కూడా చాలా యిష్టమైన పండుగ వినాయక చవితి పండుగ. ఈ పండుగ ఆంధ్ర సచిత్ర వారపత్రికకి యింకా ముఖ్యమైన పండుగ- అందుకు కారణం కూడా ప్రియతమ పాఠకు లందరికీ తెలుసు.... శ్రీ విఘ్నేశ్వర చవితి ఆంధ్రపత్రికకి పుట్టినరోజు. అరున్నొక్క దశాబ్దాల క్రితం యీ పర్వదినాన అవతరించిన పత్రిక తెలుగు పాఠకుల మన్ననా ఆదరణా చూరగొంటూ, యిప్పుడు యీ సంచిక నుంచి, డెభైరెండవ సంవత్సరంలో అడుగు పెడుతున్నది .... ఈ సందర్భంగా, ప్రియతమ పాఠకులకు, రచయితలకు, కార్టూనిస్‌లకు, ప్రకటన కర్తలకు, ఏజెంట్‌లకు అందరికీ మా శుభాకాంక్షలు!

*    *    *

ఈసారి ఆరో తేదీన పడ్డ వినాయకుని పండుగ- హాస్య సంచికను వెలువరించటంలో చిన్న తమాషా సమస్యను లేవదీసింది. పండుగకు అటైనా యిటైనా మరి ఎడం కాకుండా సంచిక తీసుకుని రావాలనుకున్నాము . . కాని ఆ ప్రయత్నాన్ని సంచిక వెలువడే తేదీలతో సుళువుగా సమన్వయం చెయ్యడం సాధ్యంకాలేదు .. అందుకనే గతసంచిక అట్టమీద యింతవరకు ఎప్పుడూ నడని, సరికొత్త పద్ధతి "ఓబొజ్జ గణపయ్యా" పూజా చిత్రాన్ని పెద్ద ఛాయా చిత్రంగా వేశాము.... ఈసారి "కార్టూనిస్టుల" సహాయంతో యెప్పటిలాగే హాస్య సంచికను అందిస్తున్నాము....

*    *    *

దీపావళి కథల పోటీల గడువు యీ నెల 16 తో తీరిపోతున్నది కనుక రచయితలంతా- గడువు లోనానే తమ రచనలు పంపడం మంచిది- 16 తరువాత అందిన రచనలు పోటీకి పరిగణింప బడవు- మరొక ముఖ్య గమనిక- తపాలా రేట్లు మారిన సంగతి రచయితలు కొందరు గమనించినట్లు లేదు- "బుక్ పోస్టు రేటు" మారిందన్న సంగతి చాలామంది మరిచిపోతున్నారు- రేట్లు తెలుసుకొని తమ తమ రచనలు పోస్టు చేయడం మంచిది.

### ఈనాటి వనితాలోకం

వై. విజయ ముఖచిత్రంతో వెలువడిన 25-8-78 వారపత్రికలోని "వనితాలోకం" శ్రీమతి మద్దా సరస్వతిగారి "చేయూత ఇవ్వండులు" వా స్తవికతకు అతిసన్నిహితముగా ఉంది. తమ అవసరాలను తీర్చుకోక తెచ్చుకొన్న వస్తువులకు ఏమి బరువు యిష్టపడగా ఉండే వనితలకు ఈ సరస్వతిగారి రచన ఎంతో కనువిప్పు.

ఎ.సి. పుల్లారెడ్డి, రవికుమార్, ప్రకాశ్ రెడ్డి, ఎల్.ఏ. చంద్ర, టి. సావిత్రి, శారద, (వంగనూరు.)

### సీరియల్

"రాగద్వేషాలు" అన్న సీరియల్ మమ్మలను ఎంతగానో ఆకర్షించినది.

ఇకపోతే కథలలోనాకు "ఆత్మసాక్షాత్కారం" అన్న కథ నాకెంతో నచ్చింది.

పి. మాధవి, పి. లక్ష్మి. (విజయనగరం.)

### కథలు

"వై. విజయ" ముఖచిత్రంగా 25-8-78 తేదితో వెలువడిన మీ (మా) అభిమాన ఆంధ్ర సచిత్ర వార పత్రిక మమ్మల్నెంతో ఆకర్షించి మరల మరల చదవాలనిపించేట్లు చేసింది. "తుక్కు-కన్నీళ్ళు," "కొత్తవెలుగు" రెండుకథలు చాల బాగున్నాయి. ఇకపోతే సీరియల్స్ రాగ ద్వేషాలు పరమపోర్‌గా నడుస్తుంటే. మోహన రూప వారం వారం క్రొత్త క్రొత్త మలుపులతో



పాఠకుల మనసులను ఆకట్టుకుంటున్నది రామలక్ష్మిగారి ప్రశ్నావళి గూర్చి వేరె వ్రాయాలా.

కుమారి పి. లక్ష్మిబాల, (బరంపురం)

*    *    *

ఈ వారం అనగా 18-8-78 వారపత్రిక మీద ముఖచిత్రం సత్యప్రియ చాలా బాగుంది. తరువాత ఈ పత్రికలో రాముడు-కోటయ్య-చిట్టోడు అను కథ మమ్మల్ని చాలా ఆనంద పరిచింది.

కె.వి. రమణమూర్తి. (రావాడ.)

*    *    *

సత్యప్రియ ముఖచిత్రముతో వెలువడిన ఈ వారం "ఆంధ్రపత్రిక" చూడముచ్చటగా, పాఠకులను ఆకర్షించేలావుంది మాదిరెడ్డి సులోచనగారి "మోహన రూప" సీరియల్ రసవత్తరంగా సాగుతోంది. ఎమ్.డి. సౌజన్యగారి "రాముడు-కోటయ్య-చిట్టోడు" కథ మా హృదయాన్ని హత్తుకుంది.

వెల్లంకి శోభారాణి వెల్ల కళావతి.

(మడికడిగ.)




వెన్నెల జీవం పోసుకుని ఉరకల పరుగులతో నురగలు చిందుతూ సంబర పడుతోంది సముద్రం. ఇంచుమించు నిర్మానుష్యంగా వున్న ఆ సముద్రపు ఒడ్డున మోకాళ్ల మీద గెడ్డం ఆన్చుకుని సముద్రంలోకి చూస్తూ కూర్చుంది, ఆమె! అంత సముద్రపు హోరులోనూ, ఆమె వెనుక నుంచి గడియో, క్షణమో వినిపించ బోయే అడుగుల చప్పుడు కోసం ఆమె చెవులూ, ఆ అడుగు జాడల్లో అనుభవించ బోయే అదృష్టపు జీవితం కోసం ఆమె మనసూ, నిరీక్షిస్తూనే వున్నాయి. మెత్తగా వున్న ఆమె జడలో వొత్తుగా వున్న మల్లెలు వెన్నెలలో మరింత విచ్చుకుని ఆ చోటంతా పరిమళాలు వెదజల్లుతున్నాయి అడపా దడపా, అటూ ఇటూ తిరుగాడే మనుష్యులు వొంటరిగా కూర్చున్న ఆమె వెనక భాగపు అందాలని వొక్కసారి ఆగి మరోమారు చూసి వెళ్ళిపోతున్నారు. ఆమెకీ విషయాలేం పట్టటంలేదు. ఆమె దృష్టి అంతా జీవం పోసుకుని ఎగిరిపడే సముద్రం మీదా, జీవితమంతా వసంతం చిందించుకోడానికని రెక్కలు విచ్చుకుని ఎగిరిపోవాలని ఆరాటపడే మనసంతా మరోక్షణంలో రాబోయే అతని మీదా, వుంది!

* * *

హడావుడిగానూ, కంగారుగానూ, ఇల్లు చేరుకున్న అతను ఇంట్లో తండ్రి వున్న సందడి వినిపించగానే, ఠక్కున ఆగిపోయాడు! ఎప్పుడో పదకొండు గంటలు ఆ ప్రాంతంలో గాని ఇల్లు చేరని తండ్రి ఆరుగంటలకే ఇంటికొచ్చేడం ఆశ్చర్యంగా వుంది అతనికి. "ఏది ఏమయినాసరే, అనుకున్న పని ఇవాళ చేసి తీరాల్సిందే" అనుకున్నాడు. "ఇన్నేళ్లొచ్చినా ఇంకా భయపడటమేనా?" అనుకున్నాడు. తనకేం! ఏమ్మెస్సీ ఫస్ట్ క్లాసులో ప్యాసయ్యేడు. ఆమె కూడా బియ్యే వరకూ చదువుకున్నదాయె! ఇద్దరూ కలిస్తే జీవించడమేపాంత కష్టం? ఈ రోజుల్లో కూడా కులాలూ అంతస్తులూ ఏమిటి? నాన్సెన్స్! నాన్న తన మీద కూడా వ్యాపారం చేద్దామని చూస్తున్నాడుకాబోలు. అదేం కుదిరేది లేదు. ఇవాళ ఆమెతో కలిసి సుదూర తీరాలకి రెక్కలు కట్టుకుని ఎగిరిపోవలసిందే! ఆమెకి మాటిచ్చాడు... మన సిచ్చాడు! ఆమె ప్రాణాలన్నీ తనమీదే పెట్టుకుంది. తల్లి తండ్రులనీ, అన్నదమ్ములనీ వొదులుకుని అయినవాళ్లందరికీ చెడ్డయిపోయి తనతో ఎక్కడికయినా చివరకి చావటానికి అయినా వచ్చేస్తానంది. ఎంత గొప్ప ప్రేమమూర్తి! ఆమెకున్న అందం తల్చుకుంటే చాలు కోటీశ్వరులు ఆమె కాళ్ళమీద పడి ఆమె కనుసన్నల్లో బానిస బతుక్కయినా సిద్ధమయిపోతారు! అంతటి అపూర్వ అందాల రాశి అమృతం లాంటి తన ప్రేమని తనపై కురిపిస్తానన్నప్పుడు పిరికితనంతో వొదులుకోడం ఎంత అవివేకం! అయినా ఆడపిల్లకున్నపాటి ధైర్యం తనకి లేకపోతే ఎలా? ఎలాగయినా బయటపడి ఆమెతో జీవితాన్ని పంచుకోవాల్సిందే! అంత ఆలోచన.. తర్జన భర్జన కొన్ని నిముషాలపాటు జరిగిం తర్వాత త్వరత్వరగా మెట్లెక్కి మేడమీద వున్న తన గదిలో పడ్డాడు. సూట్‌కేస్ తెరిచి దొరికిన బట్టలనీ, అవసరం అనిపించే వస్తువులనీ, సర్టిఫికెట్లనీ ఆదరా బాదరాగా కుక్కేసేడు. అల్మైరా తెరిచి అప్పటప్పట తను దాచుకున్న డబ్బుని తీసి లెక్క చూసుకున్నాడు. అయిదు వందలున్నాయి. ఏదో దారి దొరికే వరకూ ఎలాగోలా గడపొచ్చు. ముందు బయట పడాలి. ఇంతలో కింద నుంచి కారు బయలు దేరిన చప్పుడయింది. అంత త్వరలో తండ్రి బయట కెళిపోయినందుకు "హమ్మయ్య" అని ఊపిరి పీల్చుకున్నాడు. ఇంక నిర్భయంగా వెళ్లిపోవచ్చు. ఇంతలో తల్లి గుర్తుకొచ్చింది. ఆమెకి చెప్పి వెళ్తేనో అనిపించింది. అమాయకురాలైన ఆమె నిస్సహాయంగా కళ్ళనీళ్లు పెట్టుకుంటుంది. ఆ కళ్లనీళ్లు చూస్తే తన కాళ్లు ముందుకు కదలకపోవచ్చు. ప్రస్తుతానికి తనేం చేస్తోందీ ఎవరికీ తెలియకపోవటమే మంచిది. సూట్‌కేస్ చేత పట్టు

పని ఇలా ఆలోచిస్తూ దిగుతున్న అతన్ని అప్పుడే హాల్లోకొచ్చిన ఆ తల్లి చూడనే చూసింది.

"ఎక్కడికి నాన్నా ప్రయాణం?" ఆశ్చర్యంగా అడిగిందామె.

"ఫ్రెండు మేరేజమ్మా గుంటూరులో.. సడన్‌గా గుర్తొచ్చింది. వెళ్లకపోతే వాడు బాధపడ్తాడు. రెండ్రోజుల్లో వచ్చేస్తాను" ఏదో చెప్పాలి కదా.

"అయ్యో... మీ నాన్నగారింతవరకూ ఇక్కడే వున్నారు నాయనా చెప్పవన్నా చెప్పలేదు మరి ప్రయాణానికి నీ దగ్గిర డబ్బుందా నాన్నా?" అడిగింది తల్లి మనసు.

"ఏదో కొద్దిగా వుందిలే అమ్మా" త్వరగా వెళ్ళిపోవాలన్న తాపత్రయం మరి!

"ఊరు కాని ఊరెళుతున్నావాయె... కొద్దిగా ఏంసరిపోతుంది తండ్రీ వుండు" అని లోపలి కెళ్ళిందా తల్లి.

అతని కారాటంగా వున్న కొద్దీ ఆలశ్యమయి పోతోంది. చూసి చూసి ఆమెకి విసుగొచ్చి తన్నపార్థం చేసుకుని వెళ్లిపోతుందేమో. అనుకున్నవి అనుకున్నప్పుడు జరక్కపోతే అదృష్టం చెయ్యిజారిపోతుంది.

"ఇదుగో నాన్నా నా దగ్గిర వెతికితే మూడొందలు దొరికాయి...ఇవుంచు...పోనీ



## స్లిప్

అలా వెళ్తున్నప్పుడు దారిలో మీ నాన్నగారిని కలవకూడదంట్రా బాబూ" అందామె మూడు వందలు అందిస్తూ.

"సరిపోతుందిలే అమ్మా ... వస్తాను" అనేసి బయట పడ్డాడు.

గేటు దాటబోతూ ఒక్క క్షణం ఆగి వెనక్కు తిరిగి ఇంటి వైపు ... వాకిలిలో నిలబడి తనవేపే ప్రేమగా చూస్తున్న తల్లి వేపూ చూసాడు. క్షణం సేపు కాళ్ళు కదల్లేదు. కళ్ళల్లో నీరు కమ్ముకుంటోంది. ఛ! ఏమిటీ పిరికితనం— అనుకున్నాడు. తన గురించి సర్వస్వం త్యాగం చెయ్యబోయే ఆడపిల్ల కోసం తనీపాటైనా త్యాగం చెయ్యకపోతే తనలో వున్న మగతనానికి అర్థమేముంది? తనని తాను ప్రశ్నించుకుని సమాధానించుకుని ధైర్యంతో...ఆమె మీద అనంతమైన ప్రేమలో అడుగు ముందుకు వేసి ఆ రోడ్డు వెంబడ సాగి పోయాడు!

* * *

ఇంటిముందు కారాగిన శబ్దం కావడంతో ఆ ఇల్లుగలాయన కంగారుగా బయటకొచ్చి చూసేసరికి కారు దిగుతూ అయ్యగారు కనిపించారు. అంత పెద్దమనిషి తనింటికి రావడం ఆయన కాశ్చర్యం వేసింది. ఆత్రుతతో ఎదురుగా వెళ్ళి "దయచేయండి సార్.. కబురంపితే నేనే వొచ్చేవాడినిగా సార్" అన్నాడు వినయంగా.

"కబురంపితే జరిగే పనులు కావులెండి. అందుకే స్వయంగా వొచ్చాను" కారులో దిగినాయన కూర్చుంటూ గంభీరంగా అన్నాడు.

తన యజమానికి తన వలన జరగబోయే సొంత పనేంటో అర్థం కాలేదా ఇల్లుగలాయనకి "శెలవియ్యండి" అన్నాడు వినయంగా.

"మీరెలాగయినా మా వాడిని కాపాడాలి" అన్నాడు వొచ్చినాయన.

"ఏమిటి సార్ తమ రంటోంది" ఇల్లుగలాయన అయోమయంగా.

"రండి కారెక్కండి, చెప్తాను" అన్నాడు వొచ్చినాయన కుర్చీలోంచి లేస్తూ. పరిస్థితి అసలేం అర్థంకాని ఇల్లుగలాయన వొచ్చిన యజమానిని మౌనంగా అనుసరించడం మినహా ఏం చెయ్యలేక పోయాడు.

... ... ... ... ...

సముద్రపొడ్డు మరీ పలచబడిపోయింది. నిమ్మకుని మీద మీద కొస్తున్న వెన్నెలని కావిలించుకుని సముద్రం మరీ వెర్రెత్తి పోతోంది! ఆ హోరు తప్ప ఆ నిశ్శబ్దంలో మరో అలికిడేం లేదు. అంతవరకూ ధైర్యంగా కూర్చున్న ఆమె మనసులో అలజడి ప్రారంభమయింది. "ఇదిగో నిముషంలో" అంటూ వెళ్ళినతను ఎంతసేపయినా తిరిగి రాడేం? మనసు మార్చుకున్నాడా? ఛ...ఛ... అతనలాంటి వాడు కాదు. మరేమయినట్టు? ఎవరయినా అడ్డు తగిలారా? ఎన్ని అడ్డంకులొచ్చినా ఎదిరించి నిన్ను జీవితంలో పంచుకుంటానన్నాడే! వచ్చేస్తాడు... వచ్చేస్తుంటాడు... ఆలోచిస్తున్న ఆమెకి తన ఇల్లు గుర్తు కొచ్చింది. తన ఇంట్లో పరిస్థితెలావుందో? పక్క వీధిలో వున్న ఫ్రెండింటికి వెళ్తానని చెప్పి ఎవరూ చూడకుండా వున్న నాలుగు చీరలూ సంచీలో కుక్కుకుని బయలుదేరిన

తను ఎంతకీ తిరిగి రాకపోయేసరికి తల్లి ఎంత కంగారు పడుతోందో... ఏంచెయ్యాలో తోచక ఎంత అవస్థ పడుతోందో... ప్రతి రోజూ తను చెప్పే లెక్కలూ పాఠాల కోసం చింకిచాప పరుచుకుని కూర్చుండే చిట్టి తమ్ముళ్ళు తన రాక కోసం ఎంత ఎదురు చూస్తున్నారో? ఇంటికి వొచ్చీ రావడంతో "తల్లీ" అని పిలిచి చొక్కా విప్పి చేతికిచ్చే తండ్రి ఎంత పిలిచినా పలక్కపోయే కూతురి కోసం ఎంత విలవిలా డి పోతున్నారో? ఆ మాటా ఈ మాటా అంటూ తన్నస్త మానం ఏడిపించే అన్నగాడు చెల్లి కనబడక పోయేసరికి వెతుక్కుంటూ ఎందంట తిరుగుతున్నాడో? తలచుకునేసరికి ఆమె వెన్నెల చెక్కిళ్ళమీద మంచు బిందువుల్లా కన్నీళ్ళ బొట్లు జలజలా రాలేయి. ఇందర్ని క్షోభ పెట్టి తన జీవిత సుఖం కోసం ఇలా పారిపోవటం ఎంత స్వార్థం! కేవలం తన రెక్కల కష్టం మీద కుటుంబాన్నీదు కొస్తున్న తన తండ్రి వేలకి వేలు ఖరీదు చేసి పెళ్ళికొడుకుల్ని బేరంచేసే స్థితిలో లేడే! తన జీవితం అడవికాచిన వెన్నెల కాకముందే తనకో దారి చూసుకోవాలి కదా? ప్రతీ ఆడ పిల్లా ఏదో తెగింపు చేస్తేకాని పెళ్ళిళ్ళు కాని ఈ వ్యవస్థలో ఇంతకు మించి తనకే దారి వుందని? తనమీద అనంతమైన ప్రేమతో లక్షల ఆస్తిని కాలదన్ని అయినవాళ్లందర్నీ ఎదిరించి తన పేద జీవితాన్ని పంచుకోడానికి వొస్తోన్న అతని ప్రేమ ముందు త్యాగం ముందు తను చేస్తున్నది ఏపాటి? అతను తలుచుకుంటే లక్షలతోపాటు తనకన్నా అందమైన ఆడపిల్లలు ఎంత మంది నిల్చోరు? ఈ తరుణంలో ఈ సాహసం చేసి అతనితో జీవితం పంచుకోక పోవడమనే దురదృష్టం తన జీవితం పొడుగునా వెంటాడి వేటాడి తీరుతుంది! అందమైన ఈ అదృష్టాన్ని చెయ్యి జార్చుకోకూడదు. నిన్నా ఇవ్వాళ్టిం టాయేం అయినవాళ్ల కోప తాపాలు. మహా అయితే రెండు మూడేళ్ళు! ఎవరి పిల్లల్ని ఎవరు మాత్రం కాదనుకుంటారు? అందరితో పంచుకుని ఆనందించే జీవితం అప్పుడు లభించక పోతుందా? కొంతకాలం మాత్రం అందరికీ దూరమయి విరోధిగా జీవితం గడపాలి! తప్పదు! అయినా అతని సాన్నిధ్యంలో ఈ బాధలన్నీ మరిచిపోవచ్చు!"

కలతపడే మనసుని అదుపులో పెట్టుకుని జారిపడే కన్నీళ్లని తుడిచి పెట్టుకుని అతనితో భవిష్యత్తులో గడపబోయే అందమైన జీవితపు ఆలోచనల్లోకి మళ్ళీ జారుకుంటున్న తరుణంలో తన వెనక వినిపించిన అడుగుల సవ్వడికి అతనొచ్చే సాడని ఆనందంతో ఆత్రుతతో వెనక్కి తిరిగి చూసింది.

జాలిగా ఆమె వేపే చూస్తూ నిలబడిన తండ్రిని చూసేసరికి ఆమె వొక్కసారి తుళ్ళిపడింది!

* * *

ఎంతో ఆత్రుతతో బీచి పొద్దున్న రిక్షా దిగిన అతను తన కెదురుగా తన జీవిత సర్వస్వం...అందాల ప్రేయసి తన బ్రతుకు బాటలో సరోక్షణంలో వికసించబోయే మలె మొగ్గ తలొంచుకుని తండ్రి వెనకాల నడిచి వెళ్ళిపోతూండే దృశ్యం చూసి నిర్ఘాంతపోయాడు! అంతలోనే తమాయించుకుని వెళిపోతున్న ఆమె నాపు చేసి ఆమె తండ్రిని ప్రార్థిద్దామని అడుగు ముందుకు వెయ్యబోతున్న అతని భుజంమీద చెయ్యి పడేసరికి తుళ్ళిపడి వెనక్కి తిరిగి చూసాడు. ఎదురుగా తన తండ్రి! తను తెచ్చుకున్న సూట్‌కేసుని తీసుకెళ్ళి కార్లో పెడుతున్నాడు డ్రైవరు!

"పదనాన్నా పోదాం" మృదువుగా అన్న తండ్రి వెనకాల సాగిపోతున్న అతన్ని చూసి ఆమె వొక్క క్షణం ఆగింది!

"పద తల్లీ పోదాం" అన్న తండ్రి మాటలకి ఈ లోకంలోకి వొచ్చిన ఆమె కళ్ళల్లోంచి చివరి సారిగా జారిపడిన కన్నీటి బొట్టుని తుడుచుకుని తండ్రి వెనకాల సాగిపోయిందామె!

* * *

కార్లో వెనక సీటో కూర్చున్న అతనికి, మెత్తటి సీటు ఒత్తిడికి, హిప్ పాకెట్లో అన్ని రకాల నోట్లతో ఉబ్బెత్తుగా చేరిన వినిమిది వందలు బాధించి నటయింది. తండ్రి చూడకుండా, వాట్ని ముందు జేబులోకి మార్చుతూ, కొంచెం సర్దాడతను.

కొడుకు అవస్థని మరోలా అర్థం చేసుకున్న ఆ తండ్రి "ఏమిటి నాన్నా వెతుకుతున్నావు?– ఇదేనా?" అందించాడు.

"నిన్న నాకు వీల్లేకపోయింది– సారీ – ఇవాళ సర్వం సిద్ధమై అరున్నరకి బీచికి వొస్తాను– నిజం నమ్ము – నేనొచ్చేప్పటికే నువ్వుండాలి – ఆ క్షణంలో నువ్వు కనపడకపోతే... మరో క్షణంలో ఆ సముద్ర పొడ్డునే తేల్తాను..."

ఆ వుదయం ఆమె అతనికి అందించిన స్లిప్పు!

"మధ్యాహ్నం బ్యాంకు నుంచి తెచ్చిన స్టాక్ ఇన్‌వాయిస్ కాగితాల్తో బాటు నాన్నగారి కిచ్చేసానన్నమాట."

"వాటె స్లిప్"

కారు విండోలోంచి కనపడుతున్న సముద్రంవేపు నిర్లిప్తంగాచూస్తున్నాడతను.

విరగ కాస్తున్న వెన్నెల మీద మబ్బు మరక పడ్డంతో సముద్రం నిర్జీవమయి పోయింది!



సీరియల్

# రాగద్వేషాలు

శ్రీమతి మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్

అక్కలిద్దరూ వెళ్ళినప్పటి నించీ ఆనంద్ అదోమాదిరిగా వుండసాగాడు.

ముభావంగా పరధ్యానంగా వుంటున్నాడు.

తల్లిదండ్రుల హఠాన్మరణం వల్ల కలిగిన షాక్ నించీ అతడింకా కోలుకోలేదనీ, దానికి ఇంకా కొన్నాళ్ళు పడుతుందనీ అనుకున్నారు రావుగారు—ఇందిరా కూడా!

ఇందిర తానూ డీలా పడిపోకుండా—ఉత్సాహం తెచ్చుకుని అతణ్ణి అనునయ పరచడానికి ఎన్నోవిధాలుగా, ఎన్నోరకాలుగా ప్రయత్నిస్తూనే వుంది!

అతడికి మనశ్శాంతి నివ్వాలనీ, అతణ్ని ఉల్లాస పరచాలనీ ప్రయత్నాలు చేస్తూనే వుంది! ఓదారుస్తూనే వుంది! కానీ ఆనంద్ మారడం లేదు! ఆమె ప్రయత్నాలు ఫలించక పోగా ఇంకా చిరాకు పరాకు ఎక్కువయ్యాయి అతడికి.

అయినా ఇందిర నిరాశ పడలేదు. తన ప్రయత్నాలు మానలేదు.

ఒకరోజు!

*(గత సంచిక తరువాయి)*

"ఏమండీ! మీరు మరికొన్నాళ్ళకి వెళ్ళ కూడదూ అమెరికా—?" మురిపెంగా అడిగింది!

"ఏం— ఇంకా ఎన్నాళ్ళు తినమంటావు—తీరి కూర్చుని?" కటువుగా అన్నాడు—ఆనంద్—!

"ఏం— ఎవరి సొమ్మో తింటున్నామా? ఇది పరాయి ఇల్లు కాదుగా?"

"నీకు — కాకపోవచ్చు—" లేచి వెళ్ళి పోయాడు ఆనంద్

ఇందిర నిర్ఘాంతపోయింది తను—అతను వేరా? తన సొమ్ము అతడిది కాదా? తన తనే అతడికి పరాయిదై పోయిందా?

కన్నీళ్ళు అలుముకుంది.

జీవితం నిస్సారంగా తోచింది.

అంతలోనే తనను తాను సర్దుకుంది. అసలే అతడు దుఃఖంలో వుంటే తనేమిటి? అతడన్న ప్రతి మాటకీ పట్టించుకుని బాధ పడడం?

*   *   *

నెమ్మదిగా రోజులు గడుస్తున్నాయి. ఆనంద్ వెళ్ళే రోజు దగ్గరికి వస్తోంది

ఆ రోజు ఆనంద్ షికారుకెళ్ళగానే—లైబ్రరీ గదిలోకి వచ్చింది ఇందిర.

వెనక్కి వాలి పడక్కుర్చీలో కూర్చుని వున్న రావుగారు — పేపర్లు చూస్తూ —

"ఏమ్మా - నిద్రపట్టలేదా? రా... కూర్చో" అన్నారు

"రాను—నాన్నా! మీతో కొన్ని విషయాలు మాట్లాడదామని వచ్చాను" గంభీరంగా అంది ఇందిర!

"ఏమిటమ్మా — అంత ముఖ్యమైన విషయాలా?"

"అవును — నాన్నా!" అని గొంతు సవరించింది ఇందిర

ఆయన ప్రశ్నార్థకంగా చూస్తున్నారు.

"నేను .. నేను కూడా, ఆయనతో ఇప్పుడే... ఇప్పుడే అమెరికా వెళ్ళిపోదామను కుంటున్నాను నాన్నా...పాస్‌పోర్టు మీరెట్లా గైనా చెయ్యించాలి నాకు..." తల వంచు కుని చెప్పింది!

ఆ మాటకే తట్టుకోలేక పోయారాయన.

"వెళ్ళిపోతావా తల్లి? నన్ను ఒంటరిగా వదిలి ఇప్పుడే వెళ్ళిపోతావా?" కన్నీళ్ళు తిరుగుతుండగా అన్నారాయన.

"నాకేం చెప్పు? మీరే చెప్పండి?"

"ఆయనలో మునుపటి ఉత్సాహమే లేదు. ఎవరికీ తనం అను లేదు. ఏదడిగినా సరిగా సమాధానం చెప్పరు విసుక్కుంటారు —కసురు కుంటారు. నాతో మనసు విప్పి ఆయన మాట్లాడి ఎన్నాళ్ళయిందో! నేనా పరిస్థితిలో వున్నా అట్లాగే వుండేదాన్నేమో? ఆయనా 'షాక్' నించి కోలుకోవాలంటే కొంతకాలం పడుతుంది. ఆ కొంతకాలమూ

**జరిగిన కథ 6 :** లక్షాధికారి హనుమంత రావుగారు వివాహమాడిన బెంగాలీ యువతి గీత, ఇందిరను కనిన కొంతకాలానికి మరణిస్తుంది. ఆయన అక్క సుగుణ తన కొడుకు పారిస్ రిటర్న్‌డ్‌ను ఇందిరకు యిచ్చుటకు ఆమె అత్త మామలు నిరాకరించారని ఉత్తరంలో విచారం వెలిబుచ్చుతుంది. ఇందిరను చేసుకునే విషయములో విశ్వనాథం వ్రాసిన ఉత్తరం హనుమంతరావుని గుండె పోటుకు గురిచేయగా, ఆయన సహాయుడు శ్రీకర్ వ్రాసిన ఉత్తరం ఊరట కలిగిస్తుంది. హనుమంతరావుగారు ఇందిరకి వేరే సంబంధాలు చూస్తుంటారు. అమెరికాలో ఉద్యోగం చేస్తున్న ఆనంద్‌తో ఇందిరకు ఘనంగా వివాహం జరిపిస్తారు రావుగారు. కాపురానికి కావలసిన అన్ని వస్తువులూ ఇచ్చి, ఇందిరను అత్తవారింటికి పంపుతారు. దురదృష్టవశాత్తు తుఫాను బీభత్సంలో తల్లిదండ్రులను కోల్పోయిన అల్లుణ్ణీ, కూతుర్నీ తనింటికి తెస్తారు రావుగారు.

ఆయన నీడలాగా నేనంటిపెట్టుకుని వుండక పోతే ఆయన ఆరోగ్యం కూడా దెబ్బతినే ప్రమాదం వుంది! పోనీ కొన్నాళ్ళు ఇక్కడే వుండమంటే వుండనంటారు. అసలు విషయాలోవిప్తే ఆయన అక్కడి ఉద్యోగం వదులుకున్నా ఫర్వాలేదు. కానీ – ఆయన ఒప్పుకోరు! పోనీ ఆయన మామూలుగా నన్నా వుండి వుంటే – ముందు ఆయన వెళ్ళాక – తర్వాత నేనెళ్ళి ఆయన్ని వలద్దామనుకున్నాను. కానీ – ఇప్పుడు పరిస్థితులు నేరుగదా......!"

"అవును – తల్లీ! నువ్వు చెప్పింది నిజమే! అయినా పెళ్ళయిన ఆడపిల్లవి – నువ్వు భర్త దగ్గిరే వుండాలి. భర్త దగ్గిరుంటేనే అందం! మేమేదో కడుపుతీపి కొద్దీ ఇంకా కొన్నాళ్ళు దగ్గిరుంచుకుందామనుకుంటూ వుంటాం! కానీ-మా కడుపుతీపి మీకు బాధాకరం కాకూడదు. ప్రతిబంధకంగా కూడదు..." అన్నారు రావుగారు చిన్నగా.

కుర్చీలో కూర్చున్నదల్లా లేచి తండ్రి దగ్గిరికి వచ్చింది– ఇందిర

"నాన్నా – మీ బాధ నేనర్థం చేసుకోగలను. ఈ ప్రపంచంలో మీకున్న ఒకేఒక ఆత్మీయురాల్ని నేనేనని నాకు తెలుసు నాన్నా! కానీ చూడండి – మీరు అనుకున్నట్లుగా నేనెప్పుడూ మీకు దూరంగా వెళను. నాకు మాత్రం వేరే ఎవరున్నారు? తల్లీ, తండ్రీ కూడా మీరేగా? ఇప్పుడు నాకే కాదు. ఆయనకి కూడా మీరే తల్లీ తండ్రీను. అందుకని మేము ఎప్పుడూ మీ దగ్గిరే వుండడానికి ప్రయత్నిస్తాం –

ఆయనకి తన తల్లిదండ్రుల్ని పోట్టన పెట్టుకున్న ప్రళయం పదే – పదే గుర్తుకొస్తున్నట్టుంది. అది ఆయన మర్చిపోవాలంటే మన దేశానికి కొన్నాళ్ళు దూరంగా వుండాలి! వుంటే ఏమన్నా మర్చిపోగలరేమో! నేను కూడా ఆయనతో వెళ్తే ఇంకా తొందరగా ఆ బాధ ఆయన మర్చిపోయేటట్లు నేను చెయ్యగలనేమోనని నా ఆశ! ఆ బాధ గనక ఆయన మర్చిపోతే ఆయనకి నచ్చచెప్పి నేను ఆయన్ని ఇండియా తీసుకొచ్చెయ్యగలను. ఎట్లాగయినా ఒక సంవత్సరం లోపల మేము ఇండియా శాశ్వతంగా వచ్చి తీరతాము. ఇదిగో ఒట్టు వేస్తున్నాను.

అదీగాక నాన్నా నాకు కూడా ఆ దేశాలు కొంత చూడాలని వుంది. మీకూ తెలుసుగా? ఆ దేశాల ఆచార వ్యవహారాలు కూడా చూసి మళ్ళీ ఆయనతో తిరిగి వచ్చేస్తాను. సరేనా?" నచ్చచెప్తున్నట్టుగా మాట్లాడుతోంది ఇందిర. రావుగారు ఏమీ మాట్లాడలేక పోయారు.

"ఇందూ" గట్టిగా వినిపించిన ఆనంద్ కేకకి ఇద్దరూ ఉలిక్కిపడ్డారు.

"మవ్వెళ్ళిరా తల్లీ ఆనంద్ పిలుస్తున్నాడు..."

ఇందిర లేచి గబగబా వెళ్ళిపోయింది



## 10 రాగద్వేషాలు

ఆనంద్ ఆశ్చర్యపోయాడు ఇందిర పాస్‌పోర్ట్, వీసా వగైరాలను చూసి!

"నువ్వు నాతో వస్తున్నావా?" అన్నాడు.

"అవును – రాగూడదా ?"

"రాగూడదని కాదు గానీ – మీ నాన్న ని వొదిలి వుండగలదా – అని! అయినా ఇన్నింత తొందరగా మీ నాన్న నాతో పంపించాలనుకోవడం ఆశ్చర్యకరమే !"

కోపం వచ్చింది ఇందిరకి. అంతలోనే సర్దుకుని– "పోండి – మీకంతా హాస్యమే! నేను మీ వెంట వస్తున్నందుకు సంతోషించాల్సిందిపోయి–" అంది.

"సంతోషమే– చాలా సంతోషం–"

ఋళ్ళీ వ్యంగ్యమే– అతడి మాటల్లో! అసలీమధ్య ఇతడి మాటలు ఇట్లాగే వుంటున్నాయి! నిజంగా తను అతడి వెంట వెళ్ళడం అతడికి ఇష్టం లేదా– లనుకుంది ఇందిర.

"గొడ్డొచ్చిన వేళ– కోడలొచ్చిన వేళ–" అంటారు...అని విన్నదెప్పుడో తను –

అట్లాగే తను పెళ్ళయిన మూడునెలల లోపునే ఆస్తి పాస్తులు, ఇల్లు–వాకిలీ, గొడ్డూ–గోదా; అన్నీ పోయాయి. అత్తగారూ–మామగారూ కూడా పోయారు

అందుకని ఆతడికి తనంటే ద్వేషం ఏర్పడడం లేదుకదా ? దానికి తనేం చెయ్యగలదు ? తను బాధ్యురాలా ?

దిగాలుగా.కూర్చుండి పోయింది ఇందిర! ఉత్సాహం తెచ్చుకున్న కొద్దీ దాని మీద చన్నీళ్ళు జల్లినట్టున్నాయి అతడి మాటలు. ఏమిటీ ధోరణి ? సర్దుకుపోయిన కొద్దీ ఎక్కువవుతోంది. అతడి తీరుకి ఓర్పు చచ్చిపోతోంది.

అప్పుడే ఇంట్లోకి వచ్చిన రావుగారు – "ఏంతల్లీ –అట్లా కూర్చుండి పోయావ్ ? ఈ నాన్నని వదిలి వెళ్ళాలంటే దిగులుగా వుందా? లేక పుట్టి పెరిగిన పరిసరాల్ని వదిలి పోవాలంటే బాధగా వుందా ? నాకూ అంతేనమ్మా – అదేమిటో ఇప్పుడే నేను ఒంటరి గాడనై పోయినట్టు వుంది నాకు. అది మన మనస్సులోనే వుంటుందేమోనమ్మా? ఊహల్నే భరించలేని మనం యదార్థాన్నెట్లా భరిస్తామో కదూ ?" అన్నారు కూతురి తల మీద చెయ్యేసి నిమురుతూ

చల్లగాలి సోకి మేఘం వర్షించినట్టుగా ఆ మాటలకి దిగాలుగా వున్న ఇందిర ఏడ్చేసింది.

ఆయనకి దుఃఖం వచ్చింది.

"తండ్రీ కూతురూ అంతగా ఒకర్నొకరు విడిచి వుండలేని వారు అప్పుడే పాస్‌పోర్టూ వీసా తెప్పించేశారేం ?, కొన్నాళ్ళయ్యాకే వచ్చేదిగా ?" తొవల్నించి వస్తూ హాస్యంగా అన్నట్లే అన్నారు ఆనంద్

ఇందిర బాధ పడింది ఆ మాటలకి. తననే గాక తన తండ్రిని గూడా అట్లా హేళనగా అన్నందుకు కొంచెం కోపం గూడా వచ్చిందామెకి !

కానీ రావుగారు మాత్రం "అవును బాబూ వదిలి వుండడం కష్టమే! కానీ ఆడపిల్ల అన్న తర్వాత ఎప్పటికైనా భర్త దగ్గరుండాల్సిన పిల్లేకదా ? విడిచి వుండకా

తప్పదు. ఈ బాధ ఎంత సహజమో విడిచి వుండడం కూడా అంతే సహజం.'' అతి శాంతంగ అన్నారు.

వ్యంగ్యంగా నవ్వాడు ఆనంద్.

*  *  *

ప్రయాణం దగ్గిర పడింది. ఇందిర చాలా దిగులుగా వుంటోంది. తండ్రికి ఎన్నెన్నో జాగ్రత్తలు చెడుతోంది.

''నాన్నా! నాకీయన ధోరణేం అంతు పట్టడంలేదు మరీ విపరీతంగా తయారయి నారు. దీనికింకే కారణమూ లేదు కదా ?'' మాటల మధ్యలో అంది ఇందిర.

ఇన్నాళ్ళుగా తన మనసులో ఊగులాడు తున్న సందేహాన్ని బయట పెట్టేసింది.

తండ్రి కర్థం కావడం లేదు.

''అంటే ?''

''నేను ఈయనతో ఇప్పుడు ప్రయాణం కావడం ఇష్టం లేనట్టుంది ఆయన తీరు చూస్తే ?!''

''ఛీ, ఛీ, అంతా నీ భ్రమ! ఆనంద్‌కి నువ్వంటే ప్రాణం. నువ్వు క్షణం దూర మయినా వుండలేడతడు. నువ్వింకేమీ పిచ్చి పిచ్చి ఆలోచనలు పెట్టుకోకు. సర్దడంతా అయిందా? కొన్ని పచ్చళ్ళివి పట్టుకెళ్ళు. ఆ తిళ్ళు మనం తినలేం-'' అంటూ మాట మార్చారు రావుగారు.

తనూ మాట మార్చింది ఇందిర.

''నీ ఆరోగ్యం జాగ్రత్త. ఏ కొంచెం అనారోగ్యంగా వున్నా నాకు వెంటనే తెలియ జెయ్యాలి. వారానికో ఉత్తరం రాయాలి. దిగులు పడకూడదు ఎక్కువ శ్రమ పడ కూడదు బాగా భోజనం చెయ్యాలి. నెలకో సారి నాతో ఫోన్‌లో మాట్లాడాలి తెలుసా?''

''పిచ్చి తల్లీ!'' కన్నీళ్ళతో నవ్వా రాయన.

ఇల్లు వదలి విమానాశ్రయానికి వెళ్ళే టప్పుడు-తండ్రి గదిలో ఎంతో సేపు ఏడుస్తూ వుండిపోయింది ఇందిర.

ఆనంద్ విసుక్కున్నాడు!

విమానం ఎక్కేటైముకి ఇందిరకి నోట మాట పెగలేదు.

రావుగారికి దుఃఖంతో గొంతు పట్టుకు పోయింది. ''నాయనా, ఆనంద్—ఇందిర జాగ్రత్త!'' అంతకంటే ఏమీ మాట్లాడ లేకపోయారాయన.

ఇందిర అదీ మాట్లాడలేకపోయింది.

నోరు తెరిస్తే ఏడుపే వస్తుందని— ఆయనకి తెలుసు-ఆమెకీ తెలుసు!

ఆనంద్ నిర్లిప్తంగా వుండిపోయాడు.

ఎన్నో ఏళ్లనించి ఎన్నో రకాలుగా ఊహించుకుంటూ అపరంజి కలలు కంటూ వచ్చిన తన విదేశ ప్రయాణం ఏ రూపాన్ని దాల్చబోతోందో? విమానంలో కాలు పెట్టేటప్పుడు మాత్రం వెళ్ళాలనే ఉత్సాహమే లేదు ఏ వంకనైనా ఈ ప్రయాణం ఆగిపోతే బావుండుననే అనిపించ డం మొదలు పెట్టింది ఇందిరకి. తండ్రిని మళ్ళీ చూస్తానా అనిపిస్తోం దామెకి! స్వదేశాన్ని విడిచి వెళ్ళాలంటే ఎంతో బాధగా వుంది.

కనీసం భర్తయినా ఇదివరకు లాగా ఆత్మీయంగా వుంటే నయినా తనకీ విధంగా మనసు కలతపడి వుండేది కాదేమో అనుకుంది ఇందిర.

విమానం పైకి లేచింది.

తండ్రిరూపం దూరమయినా చెయ్యూపు తూనే వుంది కిటికీ దగ్గిర కూర్చున్న ఇందిర. అమితమైన బాధగా, వెలితిగా దిగులుగా వుంది మనస్సు

ఎయిర్ హోస్టెస్ ఏవేవో ఎనౌన్సు మెంట్లు చేస్తోంది. ఏవీ చెవిన పడడం లేదామెకి. ఆత్మీయంగా తన భుజం మీద చెయ్యి పడ్డంతో ప్రస్తుతంలోకి వచ్చింది.

ఆ చెయ్యి ఆనంద్‌ది.

''ఎందుకంతగా బాధపడతావు? నేను లేనూ—నీకు ?'' ఆ మాట చాలు తన బాధంతా పోగొట్టడానికి! కొంచెం సర్దుకుంది.

''చూడు ఇందూ, మన మెళ్ళే దేశం ఆధునికమైనది. నీలాగా ఇంతలా సెంటి మెంట్సు వుండేవాళ్ళు తక్కువ-అక్కడ. ప్రతిచిన్నవిషయానికి అంతగా ఆలోచించడం అసలు మెదడుకి మంచిదికాదు. సమయాను కూలంగా నడచుకోవాలి. కొన్నిటిని లైట్‌గా తీసుకోవాలి. లేకపోతే జీవితంలో చాలా నిరాశలు ఎదుర్కోవాల్సి వస్తుంది...!''

ఇందిరేం మాట్లాడలేదు ఈ మాట లామెకంతగా రుచించలేదు. ఏం, పరాయి దేశం పోతేమాత్రం మన అలవాట్లెందుకు మార్చుకోవాలి?

ఏదైనాసరే తనమనసుకు నచ్చితేనే చేస్తుంది ఇందిర. లేకపోతే నిష్కర్షగా చెప్పేస్తుంది-అది ఆమె మనస్తత్వం.

పరి, పరి విధాలుగా పోతున్న మనసుని— పట్టినిలపడం సాధ్యం కావడం లేదామెకి.

తనను తను కుదుటపరుచుకుని కిటికీ లోంచి బయటికి చూసినఇందిర మైమరచి పోయింది.

మేఘమాలికలు విమానంలో పోటీ పడు తున్నాయి. వాటిల్లో ఎన్నిరకాలో—ఎన్ని రంగులో!

క్రిందికి చూస్తే క్రింద అంతా ఆకు



వచ్చగా పచ్చల తివాసీ పరచినట్లున్నుంది.
అడవులను—కొండలను— సముద్రాన్ని
దాటి వెళ్తోంది విమానం !
ండల మీద నించి విమానం ఎగురు

# రా గ ద్వే షా లు

తున్నప్పుడు అదొక అనుభూతి.
సముద్రాన్ని దాటుతున్నప్పుడు విచిత్ర

మైన అనుభవం ! తెలీని గగుర్పాటు
కలిగింది.
తళ తళ వెండి రేకులా మెరుస్తోంది
సముద్రం.

అనంతమైన జలరాశి.

ఈ విమానం కూలి సముద్రంలో పడితే? ఆ ఆలోచనలకే తనకే భయం కలిగింది. సరిగ్గా సముద్ర గర్భానికి పైన వుంది విమానం. ఎయిర్ హోస్టెస్ ఆయా ప్రదేశాల ప్రాముఖ్యతలను వివరిస్తోంది.

ఈసారి శ్రద్ధగా వింది ఇందిర.

తన ప్రథమ విదేశీయానం ఒక అందమైన కలగా నిలిచిపోవాలి.

దానికై అన్నీగుర్తుంచుకోవాలి అనుకుంది.

ప్లేన్ లండన్‌లో ఆగింది.

అప్పుడు మధ్యాహ్నం పదకొండు గంటలయింది. ఒకరోజు వుంటుంది ఇంగ్లండు చూడడానికి! తరువాత రోజు పదకొండు గంటలకి మళ్ళీ విశ్వక్ ప్లేన్.

ప్లేన్ దిగుతూ అంత పెద్ద విమానాశ్రయాన్ని చూస్తూ ఆశ్చర్యపడింది ఇందిర.

పాసెంజర్స్‌కి సంబంధి హోటల్లో 'స్టే' ఏర్పాటు చేశారు విమానం వాళ్ళే.

ఆ హోటల్ పేరు 'టర్మినల్ హోటల్' లండన్ లోకల్లో చాలా పెద్ద హోటల్స్‌లో ఒకటి అది.

ఇండియాలో దాదాపు అన్ని పెద్ద సిటీల్లోనూ పెద్దపెద్ద హోటల్సు చూసింది ఇందిర. కాని ఈ హోటల్ కొత్తగానే వుంది ఆమెకూడా. హోటల్ రూములో కాసేపు గడిపి బయటకు బయల్దేరారు సైట్ సీయింగ్‌కి.

కొన్ని ముఖ్యమైన ప్రదేశాలు చూశారు.

పార్లమెంటు భవనం బయటి నించే చూశారు. చాలా ప్రసిద్ధి చెందిన 'సెంట్ పాల్స్ కెథడ్రల్', బిస్‌బెన్, వెస్ట్‌మినిస్టర్ ఏబి చూశారు. థేమ్స్ నది, టవర్ బ్రిడ్జి చూశారు. అదో వింత అనుభవం ఇందిరకి. తన బాధంతా మర్చిపోయింది. భర్తతో కలిసి అట్లా తిరుగుతుంటే దేవలోకంలో విహరిస్తున్నట్లు ఈ ప్రపంచాన్నే జయించినట్లు అనిపించ సాగింది ఆమెకి.

తను కన్న కలలన్నీ యదార్థమైనట్లే భావించ సాగింది.

షాపింగ్ సెంటర్ ఆక్స్‌ఫర్డ్ స్ట్రీట్‌కి వెళ్ళారు. అక్కడ పెద్ద గుడ్డల షాపు వుంది. మార్క్స్ అండ్ స్పెన్సర్ వారిది. అక్కడేమన్నా కొనుక్కోమన్నాడు ఆనంద్.




"అన్నీ చూద్దాం ఏం కావాలిప్పుడు?" అంది ఇందిర.

అన్నీ కుతూహలంగా చూస్తోంది.

చలికి మంచి స్వెట్టర్ కోటు కొన్నాడు తనే ఆనంద్ ఇందిర కోసం.

అమెరికాలోకంటే వులెన్స్ ఇంగ్లండులో మంచివనీ, చౌకగా వుంటాయనీ చెప్పాడు—కొంటూ ఆనంద్.

"అయితే మీరూ ఏమన్నాతీసుకోవాలి." గారాబంగా అంది ఇందిర.

---

**ఎ వ రి కి ?**

— కే ఎస్వీ

అలసిపోయాను బాబూ
అలసి పోయాను
చేతనైన వాళ్ళు కాస్త
చెయూతనక్కర్లేదు
శాంతి నివ్వండి

ఏ దూరం నుంచైనా
ఎవరైనా
ఏ మాటలోనైనా
మీటండి ఈ మనసుని
పడుకునే ముందు కాస్త
పరిమళించి పరవశించి
పోనివ్వండి

---

"నాకు వులెన్స్ చాలావేవున్నాయి... ఏదయినా మంచి షర్టు సెలెక్ట్ చేసి పెట్టు నువ్వే .." అన్నాడు.

ఎన్నో చూసి అందమైన బుష్‌షర్టు సెలెక్ట్ చేసింది చివరికి.

అప్పటికే చీకటి పడగా రూముకి తిరిగి వచ్చారు "భోజనంచేద్దామా ..?" అడిగాడు ఆనంద్

సంతోషంతో, సంతృప్తితో కడుపు నిండిపోయింది ఇందిరకి.

"వెజిటేరియన్ భోజనమేగా?..."

అతడి మాటలకి వింతగా చూసింది. "కొత్తగా అడుగుతున్నారే..." నవ్వింది.

తనూ నవ్వాడు ఆనంద్ అదోరకంగా.

వెజిటేరియన్ భోజనమే వచ్చింది.

టోస్ట్, సూప్; ఉడక బెట్టిన బంగాళా దుంపలు, కారెట్స్ ఆపిల్ ముక్కలు—కాఫీ!

ఒక స్లైస్ టోస్ట్, కాఫీ తీసుకుంది ఇందిర.

ఆనంద్ బాగానే తిన్నాడు.

ఏదో ఆలోచిస్తూ అలసటగా పక్కమీద వాలింది ఇందిర.

లైట్ ఆరిపోవడంతో ఉలిక్కిపడింది.

"ఏమిటోయ్- అంత పరధ్యానం?" ఆనంద్ నవ్వాడు ఆమెపక్కన చేరుతూ.

( ఇం కా ఉం ది )

సైన్సులో సరదాలు

# ముట్టుకోకుండా దారాన్ని కోయడం

— డాక్టర్ మహీధర నళినీమోహన్.

చిన్న దారపు ముక్కను గుండుసూదికి కట్టి, ఆ సూదిని బిరడా అడుగున గుచ్చు. ఆ బిరడా పట్టే పెద్ద గాజు సీసా తెచ్చి, ఆ దారం సీసా లోపల వేలాడేలాగ బిరడా బిగించు, బొమ్మలో చూపించినట్టు.

ఇప్పుడు మీ స్నేహితులని పిలిచి, "ఈ సీసా మూత తియ్యకుండా లోపలఉన్న దారం లోపలే ఉండగా దానిని రెండు ముక్కలుగా తెంపగలరా ?" అని అడుగు.

అలా చేయడం అసాధ్యం అని అందరూ ఒప్పుకున్నాక, భూతద్దం తీసుకువచ్చి, సూర్య కాంతిని సీసాలోని దారంమీద ఫోకస్ చెయ్యి. త్వరలోనే దారం కాలి, తెగి, ఒక ముక్క సీసా లోపల పడిపోతుంది

అయితే ఆ వేడికి సీసా పగలదేమి అని చాలా మంది ఆశ్చర్యపడతారు, దానికి కారణం ఉంది.

వెలుతురు కిరణాలు గాజులోనుంచి నిరాఘాటంగా ప్రయాణం చేయగలవు. మూసిన గాజు కిటికీలో నుంచి శీతాకాలంలో సూర్య కాంతి వెచ్చగా వంటికి తగులుతూ ఉండడం అందరికీ అనుభవంలో ఉన్నదే. అందుకనే సూర్య కిరణాలు గాజు సీసాలోంచి వెళ్ళి లోపల ఉన్న దారానికి తగిలేయి. అయితే దారిలో ఉన్న సీసా వేడెక్కకుండా దూరాన ఉన్న దారం ఎందుకు కాలింది అనేది అసలు ప్రశ్న. దీనికి సమాధానం చెప్పే ముందు వెలుగు, వేడి — ఏటి లక్షణాలను గురించి రెండు మాటలు చెప్పాలి.

సూర్య గోళం పై భాగాన 6000 డిగ్రీల ఉష్ణోగ్రత ఉంది. భూమి మీద 30°C ఉన్నదనుకుందాం. విమానంలోగాని, హైడ్రోజన్ బుడగలోగాని ఎక్కి పైపైకి వెడితే, సూర్యుడికి దగ్గరగా వెళుతున్నట్టే కదా. కనుక పైకి వెళ్ళినకొద్దీ వేడి పెరగాలి కదా ? కాని, పైకి వెళ్ళినకొద్దీ ఉష్ణోగ్రత తగ్గిపోతూ ఉంటుంది. ఏమిటి విచిత్రం ?

రాయి, కర్ర, మట్టి వంటి అపారదర్శక వస్తువులకి తగలగానే వెలుగు వేడిగా మారుతుంది. గాజు, గాలివంటి పారదర్శకవస్తువులలో నుంచి వెలుగు నిరాఘాటంగా ప్రయాణం చేస్తుంది కాని వేడిమిగా మారదు కనుక సూర్యుడి నుంచి వచ్చే కాంతి దారిలో ఉన్న పారదర్శకమైన గాలిని వేడిచేయక, సరాసరి





భూమికి (అపారదర్శకం) తగిలి వేడిగా మారుతుంది. నేల వేడెక్కుతుంది. వేడెక్కిన నేల దానిని ఆవరించి ఉన్న గాలిని వేడి చేస్తుంది అందుకనే నేలకి దగ్గరలో వేడిగానూ, నేలను విడిచి పైపైకి వెళ్ళిన కొద్దీ చల్లగానూ ఉంటుంది. సరిగ్గా ఈ కారణం చేతనే కొండల మీద చల్లగా ఉంటుంది.

మన గారడీలో సూర్య కాంతి పారదర్శకమైన సీసాని వేడి చేయక, అపారదర్శకమైన దారానికి తగిలి, అక్కడ వేడిగామారి, దారాన్ని కాల్చింది. ఒకసారి వేడిగా మారిన తరువాత, ఆ వేడిమి సీసాలో నుంచి దూరి బయటకు జారుకోవడం సులభం కాదు. వెలుగుకి పారదర్శకమైన గాజు, వేడికి అపారదర్శకమే !

ఇదే విధంగా సీసాలో ధాన్యపు గింజలు పోసి, భూతద్దంతో వేడి చేసి, వాటిని పేలాలుగా మార్చవచ్చు సీసా పగలకుండా! ●

రూ. 25,000
బంగారపు నగలు
(లేదా దానికి సరిపడ్డ నగదు)

# శింగార్
# అసలీ-నకిలీ కుంకం పోటీ

శింగార్ పోటీ ప్యాక్, ఎంట్రీ ఫారాల కోసం మీ డీలర్‌ను అడగండి.

**విజేతకు బహుమానం:**
రూ. 10,000 విలువగల ధగధగ మెరిసే 22 కేరట్ల బంగారపు సెట్టు.



**రెండవ బహుమానం:**
రూ. 5,000/- విలువగల 22 కేరట్ల బంగారపు నెక్లెన్, లోలకులు.



**మూడవ బహుమానం:**
రూ. 2,500/- విలువగల బంగారపు కంకణం.



**నాల్గవ బహుమానం:**
రూ. 1,500/- విలువగల రెండు బంగారపు గాజులు.

**100 కన్సొలేషన్ బహుమతులు:**
ఒక్కొక్కటి రూ. 55/- విలువగల వెండి జూకాలు.



మార్కెట్టులో అసలైన శింగార్ కుంకం ఉన్నదొక్కటే–నకిలీ సరుకులు ఎన్నెన్నో. ఏది అసలైనది, ఏది నకిలీ? ఎంట్రీ ఫారమ్‌లోని సరళమైన ప్రశ్నలకి సమాధానం యివ్వడం ద్వారా కనుక్కోండి. ఎంట్రీ ఫారమ్ డీలర్ దగ్గర దొరుకుతుంది. మీదే యిక అదృష్టం!

పారమౌంట్ ప్రోడక్స్, 809, ప్రసాద్ ఛాంబర్స్,
బొంబాయి 400 004.

everest/78/SH/98 tl



స్థానక గణపతి (ముఖ లింగం)

# చైనా, జపాన్‌లలో

భారతీయ శిల్పాలలో వినాయకుని ఒక ప్రధాన దేవుడుగాను, లేదా పరివార దేవతలలో ఒకడుగాను చూస్తాము ఉత్తర భారత దేశంలో గుప్తుల కాలమునుంచి గణపతి విగ్రహాలు చూడవచ్చు గుప్తుల నాణెములలో కుమారస్వామి మరియు అతడి మయూర వాహనం చెక్కబడినాయి కాని వినాయకుడు కానరాడు దక్షిణ భారత దేశంలో మొట్టమొదటి గణపతి శిల్పాలు విష్ణు కుండినుల కాలం నాటివి నాగార్జున కొండ త్రవ్వకాలలో క్రీ శ మూడవ శతాబ్దం నాటి ఇక్ష్వాకుల దేవాలయాలు బయల్పడ్డాయి వీటిలో కుమారస్వామి విగ్రహం ఆలయం ఉన్నదేగాని గణపతి విగ్రహం లభించలేదు

ఎదవ శతాబ్దం నాటికి హిందువులలో గాణపత్యులనే ఒక ప్రత్యేక మత శాఖ ఏర్పడింది గాణపత్యులకు గణపతి ప్రధాన దైవం వీరు త్రిమూర్తులకన్నా గణపతి అధికుడని భావించారు. గాణపత్యులలో ఆరు శాఖలున్నట్లు తెలుస్తోంది

## రకరకాల

దక్షిణ భారత దేశంలో బాదామి చాళుక్య శిల్పాలలో కూడా మనకు గణపతి విగ్రహాలు కనిపిస్తాయి బాదామి యందలి ఒక గుహ వెలుపలి భాగంలో నటరాజ విగ్రహంతోబాటు గణపతి శిల్పం ఉంది ఇది క్రీ శ ఆరవ శతాబ్దం నాటిది ఈ కాలానివే ఐహోళె గుహాలయాలలో, దేవాలయాలలో కూడా ఉన్నాయి

## ఎల్లోరాలో గణపతి

వీటి తరువాత కాలానివి ఎల్లోరా గుహలలో ఉన్నాయి ఎల్లోరాలో గణపతిని సప్త మాతృకల సరసన చెక్కారు ఎల్లోరా యందలి రామేశ్వర గుహాలయంలో పార్వతీ పరమేశ్వరుల కళ్యాణ శిల్పంలో గణపతి, కుమారస్వాములను ఇద్దరినీ చెక్కడం ఒక విశేషం ఈ విషయాన్ని గురించి శ్రీ గోపీనాథరావు తమ గ్రంథంలో ప్రస్తావిస్తూ ఆ ఇద్దరు శిశువులు పార్వతీ పరమేశ్వరుల కలయిక

## చిట్టెమ్మా! నీ చిత్రాలెన్ని!?

ఇదేం ప్రశ్నయ్యా బాబూ! ఎలాంటి చీకు, చింతా లేకుండా దేవలోకంలో సుఖంగా కాలం గడుపుతున్న నీకు చిత్రాల సంగతెందుకయ్యా తండ్రీ! ఎంత ఖాటన్నావమ్మా! ఇంతకాలం మా లోకంలో కూర్చొనే ఈ లోకాన్ని, ఇక్కడి వ్యవహారాల్ని, వాతావరణాన్ని చూస్తుండేవాడ్ని. ఈసారి ఎందుకనో మిమ్మల్నందర్నీ నేరుగా పరామర్శించి, దీవించి వెళ్ళాలని వచ్చాను చాలా సంతోషం మీ విశాలహృదయానికి వినయాంజలి ఘటిస్తున్నాము దేవలోకవాసివి, దివ్యదృష్టి సంపన్నుడవైన నీకు ఈ లోకంలో జరుగుతున్న చిత్రాలను గూర్చి చెప్పే అర్హతగానీ, అనుభవం




## తారలతో వినాయకుడి ఇష్టాగోష్ఠి

గానీ నాకు లేదు కానీ పెద్దవాడివి అడిగావు కనుక చెబుతున్నాను. మా లోకం పేరే చిత్రలోకం. ఇక్కడ తీసేవీ చిత్రాలే. జరిగేవీ చిత్రాలే. ''సినిమాస్కోప్'' పేరు ఎప్పుడైనా విన్నావా! అని నేనడిగితే గ్లోబంతా తిరిగే నాకు స్కోప్ సంగతి తెలియదా అని నువ్వంటావేమో. నువ్వేమనుకున్నా చెప్పడం నా ధర్మం తెరమీద ఈ సినిమాస్కోప్‌లో ఒక చిత్రాన్ని చూడు. మా లోకం వదలి వెళ్ళవేమో అని నా సందేహం. 70 యం. యం. ను కూడా ప్రవేశపెడుతున్నారు త్వరలో మా మనుషులు. అది చూస్తే నిజంగానే నువ్వు మీ లోకం వెళ్ళవు. ఈ చిత్రాలన్నీ మీ లోకంలో చూడాలన్నా కుదరదనుకుంటా. ఎందుకంటే అక్కడి పాలసీస్, ప్రిన్సిపుల్స్, ప్రాబ్లమ్స్ ఇలాంటి రిక్రియేషన్ను అంగీకరించవేమో! ''కరెక్ట్‌గా చెప్పావమ్మాయ్! చిత్రలోకంలో జరిగే చిత్రాలన్నీ ప్రత్యక్షంగానే చూసి వెళ్ళాలని నిర్ణయించుకున్నాను. దీనికి మీ లోకం ఒప్పుకుంటుందా!'' అంతకన్నా అదృష్టమా! నీలాంటి వేల్పు, మా కండగా వుంటే, 70 యం. యం. ఏమిటి! యింకా ఎన్నో చిత్రాల్ని సృష్టించడానికి ప్రయత్నిస్తారు మావాళ్ళు.

(పై ఊహాగాన హాస్యరస సంభాషణం వినాయకులవారికి, కుమారి జయచిత్రకు మధ్య జరిగింది.)

—జనప్రియ



# కూడా గణపతి విగ్రహాలు!

## వినాయకులు!!

వల్లనే జన్మించారని అనుకోరాదని వారిరువురు కూడా ఇతర దేవతలవలె అనాదిగా వున్నారని, కాలక్రమేణా వారిని పార్వతీ పరమేశ్వరుల యొక్క పుత్రులుగా భావించడం జరిగిందని వ్యాఖ్యానించారు.

తిరుచ్చిరాపల్లి, వల్లంలలో ఏడవ శతాబ్దానికి చెందిన గణపతి ప్రతిమలున్నాయి గణపతి విగ్రహాలలో కొన్నింటిలో తొండము కుడివైపుకు మరికొన్నింటిలో ఎడమవైపుకు తిరిగి వుంటాయి. వల్లంలో కుడివైపుకు తిరిగివుంది

తూర్పు చాళుక్య శిల్పాలు బిక్కవోలు, ద్రాక్షారామ దేవాలయాలలో ఉన్నాయి. బిక్కవోలు గ్రామంలో పంటచేల మధ్య ఉన్న ఆసీన గణపతి విగ్రహం పరిమాణంలో చాలా పెద్దది తూర్పు చాళుక్య గణపతి శిల్పాలలో కొన్నింటికి రెండు చేతులే వున్నాయి కిరీటం లేదు

దక్షిణ దేశంలో యింకా కళ్యాణి చాళుక్య చోళ, కాకతీయ, హోయసల, విజయనగర దేవాలయాలలో వివిధ రూపాలలో గణపతి విగ్రహాలు కనిపిస్తాయి

వ్యాసం, ఫొటోలు పంపినవారు :
**డా॥ వేమూరు కామేశ్వరరావు**



బిక్కవోలు గణపతి



దేవీ సహిత గణపతి



ఆసీన గణపతి

## వర్ణ చిత్రాలలో గణపతి

రాజపుత్ర వర్ణ చిత్రాలలో గణపతిని మనం చూడవచ్చు. కాంగ్రా ప్రాంతపు వర్ణ చిత్రాలు రెండు రకాల విషయాలకు సంబంధించి వున్నాయి. ఒక రకము గ్రామీణ జీవనానికి సంబంధించి ఉంటుంది. ఇంకొక రకము పౌరాణిక; ఐతిహాసిక విషయాలకు సంబంధించినది. కాంగ్రా వర్ణ చిత్రాలలో శివపార్వతుల సరసన గణపతిని, కుమారస్వామిని చిత్రిస్తారేగాని గణపతిని ప్రత్యేకంగా చిత్రించలేదు

## విదేశాలలో గణపతి

నేపాల్, టిబెట్‌లలో వర్ణ చిత్రాలలో గణపతిని నాట్య గణపతిగా చిత్రించారు ఒక నేపాల్ వర్ణ చిత్రంలో మధ్యన నాట్య గణపతి ఆయన చుట్టూ మరో నాలుగు గణపతి బొమ్మలు చిత్రించారు నేపాల్‌లో వినాయకుడు శివపార్వతుల తనయుడు అనే వాదాన్ని నమ్మరు సూర్య కిరణము నుండి గణపతి ఆవిర్భవించాడని వారి నమ్మకం సింహవాహనుడైన హేరంబ గణపతి మన దేశంలోనే గాక నేపాల్‌లో కూడా కానవస్తాడు అయితే నేపాల్‌లో హేరంబ గణపతి దేవీ సమేతుడై ఉంటాడు

సయాంలో బౌద్ధులకు బౌద్ధేతరులకు గూడా గణేశుడు ఆరాధ్య దైవం కాంబోడియాలో మన దేశంలో లాగానే ఎనిమిదవ శతాబ్దానికి ముందు చేసిన గణపతి శిల్పాలలో కిరీటం లేదు మన దేశంలోని తొలి విగ్రహాలలో గణపతికి రెండు చేతులున్నట్లే జావాలో రెండు చేతుల గణపతి విగ్రహం దొరికింది దీనికి కూడా కిరీటం లేదు

## చైనా, జపాన్‌లలో గణపతి

చైనా, జపాన్‌లలో ప్రధానంగా రెండు రకాల గణపతి ప్రతిమలు కనిపిస్తాయి. మొదటి రకంలో ఏనుగు తల, రెండు చేతులు కలిగిన గణపతి పద్మాసనంలో కూర్చుని ఉంటాడు. రెండవ రకంలో నిలుచుని ఉన్న ఇద్దరు వినాయకులు (ఏనుగు తలలతో) ఒకరి నొకరు ఆలింగనం చేసుకొన్న భంగిమ కనిపిస్తుంది. ఈ రెండవ రకం ప్రతిమలు చైనా, జపాన్‌లలో తప్ప మరెక్కడా కానరావు.

## పేదల పాలిట పెన్నిధి!



← ఫొటో బోనేపల్లి మురళి



—సీరియల్—

# మోహన రూప

—మాదిరెడ్డి సులోచన—



''ఏమిటన్నయ్యా అలా చూస్తావ్?'' అన్నది పూర్ణ

''మీ ఆయన ఎంత భాగం కొరుక్కు ఎన్నాడోనని ''

''ఛీ పో '' అవతల గదిలోకి పారిపోయింది పూర్ణ

''చెల్లెలితో ఏమిట్రా హాస్యాలు !'' జయమ్మ ముసి, ముసిగా నవ్వింది మధ్యాహ్నం క్యారియర్ తెచ్చాడు అందరూ భోజనాలుచేసి పడుకున్నారు ఉన్న ఒక్క క్యాంప్‌కాట్‌పై తండ్రి పడుకున్నాడు తల్లి కిరువైపులా పసిపిల్లల్లా కొడుకు, కూతురు పడుకున్నారు పూర్ణ ఓ గంటసేపు అన్నతో కబుర్లు చెప్పింది ఆ కబుర్లలో ఎక్కువభాగం తన భర్తను గురించే

''తనకసలు కూరల్లో కొబ్బరి వేస్తే గిట్టదు '' భోజనాలు అవుతుండగా చెప్పింది

''తనంటే! '' అల్లరిగా అడిగాడు

''తనంటే తెలియదా! ఫో, నేను మాట్లాడను '' మూతి ముడిచింది

''ఆం చెప్పు తనంటే శ్రీ శ్రీ శోభన్ గారు ''

ఒక అయిదు నిమిషాలు మాట్లాడక వూరుకున్నారు ఆ తరువాత మళ్ళీ చెప్పింది

''ఆయనకు నీలం రంగంటే యిష్టంరా మంచంపై దుప్పటి నలగవద్దంటాగ ''

ఆ కబురు, ఈ కబురు చెప్పి నిదురబోయింది ఇంద్రమోహన్‌కు నిదుర రావటంలేదు

''ఇంద్రా !''

''పిలిచారా నాన్నా !'' లేచి కూర్చున్నాడు తండ్రిని అంత గంభీరంగా యెన్నడూ చూడలేదు పరీక్షగా చూస్తే ఆయన తలలో తెల్లవెంట్రుకల

## ( గత సంచిక తరువాయి )

సంఖ్యే యెక్కువగా కనిపిస్తుంది ముఖంలో ముడతలు స్పష్టంగా కనిపించాయి లేచివెళ్లి తండ్రి ప్రక్కన కూర్చున్నాడు

''ఇంద్రా! అల్లుడు తన దువు అయ్యేవరకు పూర్ణను ఇక్కడే ఉండమన్నాడట ఆ కట్నం డబ్బు యెలా సర్దగలం బాబూ!'' అన్నాడు అతని కళ్లల్లో కొడుకుపై మోయలేని బరువు పడుతుందన్న బాధ స్పష్టంగా కనిపిస్తుంది

''ఏదో ఒక మార్గం దొరక్కపోదు నాన్నా! ఒక ఆరు నెలలు గడవనియ్యి, ఏదో చిట్‌ఫండ్‌లో చేరి, డబ్బు తెస్తాను '' అన్నాడు

''ఏమిటోరా! పట్నం మామయ్య ఓ సలహా ఇచ్చాడు ''

''ఏమిటి నాన్నా ?''

''తన తమ్ముడి కూతురు జానకిని చేసుకుంటే పాతిక వేలు కట్నం ఇప్పిస్తాడట '' ఆశగ చూశాడు

''నాన్నా! ఆ విషయం తరువాత ఆలోచిద్దాం జీవితాంతం నా కట్నం డబ్బు వాడుకున్నారన్న అపవాదు ఎందుకు! కాస్త ఊపిరి పీల్చుకోనివ్వండి'' అన్నాడు

''నీకు ధైర్యం ఉంటే చాలురా. .'' అన్నాడు

ఈమాత్రం బాధ్యతాయుతంగా తండ్రి ఆలోచిస్తే సంసారం యెప్పుడో బాగుపడేది చేతులు కాలాక ఆకులు అన్నట్టుగా ఉంది

తండ్రి కళ్లు మూతలు పడ్డాక లేచి, సామాన్లు లోపటికి చేరవేశాడు

''ఆం... పేరు తెలియదుగాని ఇక్కడే ఉంటున్నాడు..'' ప్రక్కవాళ్లమ్మాయి గొంతు వినిపించి బయటికి వచ్చాడు అతని కళ్లు వెడెల్పు అయ్యాయి అపనమ్మకంగా చూచాడు రూపాదేవి వస్తుంది

''నన్ను గుర్తు పట్టినట్టున్నారు .'' కంటి కొసలలో కొంటెతనం మెరుస్తుండగా నవ్వింది

''రండి రండి.. అమ్మా పూర్ణా. '' హడావుడిగా వాళ్లను లేపేశాడు

''ఏమిట్రా !'' గుమ్మములో నిలబడిన రూపను చూడగానే జయమ్మ ముఖం ఉదాసీనంగ మారిపోయింది ఆవులిస్తూ లేచి కూర్చుంది

''ఇంకేం అవమానాలు మిగిలిపోయాయి తల్లీ !'' అన్నది ఎంత నిదానంగా అనబోయినా, కంఠంలో కరుకుదనము కర, కరలాడింది రూప అభిమానపడలేదు.

''అమ్మా !'' ఇంద్రమోహన్ కంగారుగా

**జరిగిన కథ. 12** స్నేహితులు విశ్వం, ఇంద్రమోహన్, పాషా, స్యామ్సన్, పక్రిలు విహార యాత్ర ముగించుకొని హైదరాబాద్ చేరినపుడు ఇంద్రమోహన్ ఐ డి పి ఎల్‌లో ఇంటర్వ్యూకి వెళ్ళగా, మిగిలిన స్నేహితులు, అక్క సుగుణ, బావంతో కలిసి ఒక సంబంధం చూస్తాడు విశ్వం ఆమె శ్రీహరి, రుక్మిణిల ఏకైక కుమార్తె డాక్టర్ రూప ఆమె ఆహ్వానంమీద ధనికుడైన విశ్వం బీదవాడైన ఇంద్రమోహన్‌తో నర్సింగ్‌హోమ్ చూడటానికి సాగర్ వెళ్తాడు కానుకలన్నా కోరలేదన్న కారణంగా తనకు, తన చెల్లెలు పూర్ణకు కుండమార్పిడి సంబంధం విఫలమవడం, ఉద్యోగ ప్రయత్నంలో మోసగింపబడడంవల్ల ఇంద్రమోహన్ నిరాశా నిస్పృహలకు లోనవుతాడు రూప తండ్రి విదేశాలకు వెళ్ళిన సమయంలో ఇంటి వ్యవహారాలు చూసే ఉద్యోగం చేస్తూ ఆమె నడవడి కనిపెట్టటానికి ఇంద్రమోహన్‌ను పంపుతాడు విశ్వం రూప దూరపు బంధువైన శోభన్, ఇంద్రమోహన్‌లతో చనువుగా ఉండటాన్ని క్లినిక్ ప్రారంభోత్సవానికి వచ్చిన విశ్వం గమనిస్తాడు దురలవాట్లకు లోనయిన విశ్వం ప్రవర్తనను గురించి రూప, ఇంద్రమోహన్‌ని ప్రశ్నిస్తుంది. ఇంద్రమోహన్‌కు తప్పిపోయిన సంబంధం తాలూకు అమ్మాయి, సావిత్రి, అబార్షన్ చేయించుకొనే నిమిత్తమై రూప నర్సింగ్‌హోమ్‌లో చేరుతుంది రూప, ఇంద్రమోహన్‌లు మరింత సన్నిహితు లవుతారు తనకు, శోభన్‌కు అక్రమ సంబంధం అంటకట్టాడని విశ్వాన్ని, డైరీ చూచి ఇంద్రమోహన్‌ని, వెళ్లగొడుతుంది రూప ఉన్న ఇల్లు కూడా అమ్మి పూర్ణకు పెండ్లిపనులు జరుపుతుండే సమయంలో, ఇంద్రమోహన్‌కు బ్యాంకులో ఉద్యోగం వస్తుంది ఇంద్రమోహన్ 'దొంగ' అని తెలిసి పీటలమీది పెండ్లి భగ్నమయ్యే సమయంలో, ఇంద్రమోహన్ డైరీ ఆ సాంతం చదివిన రూప వచ్చి నిజం చెప్పినా పూర్ణ ఆ వివాహానికి అంగీకరించదు ఉన్నంతలో శోభన్‌కు, పూర్ణకు వివాహం జరిపిన పిదప, ఉద్యోగంలోకి ప్రవేశిస్తాడు ఇంద్రమోహన్

చూచి, ఉన్న ఒక్క కుర్చీ ముందుకు జరిపాడు రూప వచ్చి కూర్చుంది. రామలింగం గోడవైపు తిరిగి పడుకున్నాడు పూర్ణ లేచి అవతలి గదిలోకి పారిపోయింది.

జయమ్మ చూపులు ఎందుకొచ్చావన్నట్టు న్నాయి రూప గ్రహించింది

"ఏదో చిన్న అపార్థంవల్ల దొంగతనం ఆపాదించబడింది. అందుకు క్షమించండి తాతయ్య కూడా తన తొందరపాటుకు చాలా చింతించాడు వాళ్ల దగ్గర అయిదువేలు తీసుకువచ్చారు అవి ఇచ్చి వెడదామనే వచ్చాను." పర్సు తీసి డబ్బు ఆమెకు యిచ్చింది. యాంత్రికంగా అందుకున్నది.

"నిజంగా వాళ్లు తిరిగి యిచ్చారా ?" ఇంద్రకు సందేహం వచ్చింది.

"అయిదువేల రూపాయలు అప్పనంగా ఇచ్చే సహృదయులం కాదండోయ్. మీరు కుంకం అంటించారు చూడండి..." అన్నది రూప నవ్వుతూ

"ధన్యవాదాలు .." అన్నాడు ఏమనలేక.

"హృదయపూర్వకంగా అంటే థాంక్స్..." అన్నది కొంటెగా అతనివంక చూచి





# బైస్కోపు బాతాఖానీ

## ముగ్గురు ప్రదర్శకులు !!!

రాజ్‌కపూర్, మనోజ్‌కుమార్, దేవానంద్, ఈ ముగ్గురూకూడా గొప్ప "షోమాన్‌షిప్" వున్న "వన్ మేన్ ఆర్కెస్ట్రా" గాళ్లే! రాజ్‌కపూర్ సినిమా తీస్తే కథానాయికకి "వరూధిని"ని మరపించే సౌష్టవ ప్రమాణాలుండి తీరుతాయి — అమ్మాయి వక్షోజ సంపదతో వెండితెరకి పొడవు వెడల్పులతో పాటు ఎత్తూ, లోతూ కూడా రావాల్సిందే!

మనోజ్‌కుమార్ హీరోయిన్‌కి దగ్గరిసా రాడుగాని వోసారి ఆ అమ్మాయిని వానలో తడిపేసి ఆ "తడి చీర" అడ్డంపెట్టి అత్యద్భుతంగా — సౌష్టవ ప్రమాణాలను యినుమడింపచేసి అన్ని కోణాల్లోను వాటిని చూపించి — "సెక్సప్పీల్"కి ఆకాశపు టంచులు యివి అన్నట్లు చూపి బాక్స్ ఆఫీసు దగ్గర డబ్బులు ఏంజేస్తాడు! దేవానంద్ హీరోయిన్‌తో వరసగా డ్యూయట్‌లు పాడుతూ మధ్య మధ్య ఆ పిల్ల [సాధారణంగా "పిల్ల"నే వెండితెరకి పరిచయం చేయడం దేవ్ అలవాటు] చెంపలు నిమురుతూ, చెంపకి చెంప రాస్తూ చెవులో "గుసగుసలు పోతూ" — మోకాళ్ల కడ్డంగా చేతులూపుకుంటూ, పరిగెడుతూ పాటలు పాడటం అతని ప్రత్యేకత 'కథ' యీ ముగ్గురి సినిమాల్లోను కథానాయకుడి చుట్టూ తిరుగుతుంది అది ఒక్కోసారి వైకల్పికం అందుకు భిన్నంగా "సత్యం శివం సుందరం"లో కామిరా "జీనీబేబీ" శరీరపు వొంపుసొంపుల చుట్టూ తిరిగిందేమో — అది కాస్తా యీ శతాబ్దపు విచిత్రమై వూరుకుంది! — దేవానంద్ సత్యం శివం సుందరం మీద వదిలిన దేశ్ పరదేశ్ "బాంబ్" బాగా పేలింది. ఈ చిత్రంలో "టైనామునీవ్" "జీనీ బేబీ" నగ్నసౌందర్యం మీద, రాజ్‌సాబ్ సౌందర్యోపాసన మీద కూడా దేశ పరదేశాలలో దెబ్బకొడుతున్నదని పత్రికల రిపోర్టులు చెబుతున్నాయి

చాలా రోజుల తరువాత దేవానంద్ కూడా ఫార్ములా మార్చాడు — ఈసారి కూడా అతను ఛాన్సు యిచ్చిన అమ్మాయి మనుమరాలి యీడుదే ఐనా "టైనా బేబీ"తో తెరమీద శృంగార క్రీడలు పెట్టుకోకుండా — యీ "అరవిచ్చిన మొగ్గ" లాంటి "స్వీట్ సెక్స్టీన్"ని బీరు డ్రమ్ములో పడేసి కేరింతలాడించాడు ఫర్ ది బెనిఫిట్ ఆఫ్ ఆడియన్స్ టీన్సీ అయితేనేం? ఎక్కడా "సత్యం శివం"లోని వల్గారిటీని రానివ్వలేదు దేవానంద్ 'టైనా'ని ఎంత జాగ్రత్తగా, గాజుబొమ్మని చూపించినట్లు చూపించాలో అంత జాగ్రత్తగా చూపించాడు. యింకో సంగతి తన చుట్టూరా తిరిగే కథని కొంచెం మార్చి — ఒక కొత్త కథా వస్తువు తీసుకుని దాన్ని "డిటెక్టివ్" ఫక్కీలో వాడుకున్నాడు — లండన్‌కి పొట్ట చేత పట్టుకొని "సుఖ జీవన లాలసతో" వున్నదంతా అమ్ముకుని దొంగతనంగా వెళ్లిపోయే. భారతీయ దౌర్భాగ్యుల మీద అక్కడ కొన్ని ముఠాలు ఏ రకమైన వ్యాపారం చేస్తున్నాయో చూపించాడు అదే కొత్తదనం — మనకి "లండన్"లోని దృశ్యాలు, భవనాలు మొదలైనవాటి ఎగ్జిబిషన్ చూపించక పోయినా — యీ చిత్రానికి "శ్రీరామరక్ష అయింది...". మరీ పాతచింతకాయ పచ్చడి కాదిది

"టైనామునీవ్" తాజా అందంతోపాటు చిన్న పిసరు "ఏక్టింగ్" కూడా చేసి చూపెడుతుంది! అమ్జాద్‌ఖాన్ కొత్త మాడల్ విలన్, అజిత్ పాత మాడల్ విలన్ — అన్నింటికన్నా మించి కిషోర్‌కుమార్ పాటల చిత్రీకరణలో దేవానంద్ చూపించిన కొత్త మెళకువలు — ఎడిటింగ్‌లోను, ఫ్లాష్‌బ్యాక్‌ల వాడకంలోను దేవానంద్ చేసిన నిస్వార్థ సేవవల్ల దేశ్ — పరదేశ్ నిలబడ గలిగింది — "ఇష్క్ ఇష్క్ యిష్క్" తరువాత యిక దేవానంద్ ఫినిష్ అనుకున్న అతని అభిమానులకి దేవానంద్ "ప్రదర్శన నైపుణ్యం" మళ్లీ దేశ్ — పరదేశ్ లో అగపడుతుంది!

"టైనా" కిది "హరే రామ హరే కృష్ణ"లో జీనీబేబీకి వచ్చిన అవకాశంకన్నా మంచి అవకాశం ఈ అమ్మాయికి యిరవై ఏళ్లొచ్చేసరికి పాతిక చిత్రాలు పూర్తిచేసే 'గ్లామర్' వుంటుంది!

పైగా మొహం తప్ప తతిమ్మాచోట్ల "నాది ఫస్టుమార్కు" అన్న జీనత్‌అమన్‌కి యింకా "భారతీయ చేతనం" కనులలో చూపెట్టడం రాలేదు కారణం 'సోగకనులు' లేవు — ఉన్నదంతా శరీర సౌష్టవం మాత్రం, అదే సత్యం శివం సుందరం అంటే జనం ఒప్పుకోమన్నారు అయితే యిందులో జీనత్ తప్పేంత? డైరక్టర్‌గారు "బొమ్మల" పిల్లకి పల్లెటూళ్లో ఆదివాసి దుస్తులు వేసి పూరిమీద త్రిపురతార్ని చూపించడంలో — ఏదో సత్యాన్ని — శివాన్ని — సుందరాన్ని — చూశాడు చూపెడదామనుకున్నాడు! కాని జనం చూడకపోతే? అదెవరి తప్పు? ఇప్పుడు మనోజ్‌కుమార్ "క్రాంతి" కోసం చూడాలి — మనోజ్ ఏ సత్యం శివం సుందరం చూపెట్టినా అందులో "యిస్ దేశ్‌కి ధర్తీ" వుంటుంది ఆగస్టు 15 న సిలన్ రేడియోకి పనికివచ్చే నాలుగు పాటలు ఐనా కమ్మగా వుండితీరుతాయి సో లెటస్ వెయిట్ అండ్ సీ!

[ వీరాజీ ]

## మోహన రూప

"నిజంగా అంటున్నాము" అన్నాడు, కళ్లతోనే తన మాటలు లెక్కచేయవద్దని అర్థిస్తూ

"వస్తానుమరి. పదిహేనురోజు లయింది డబ్బు వచ్చి కాని మీరు యెక్కడ వున్నారో తెలియలేదు"

"ఇదిగో ఇల్లు దొరకగానే వచ్చి కలుద్దాం అనుకుంటున్నాను అశ్రద్ధ అయిపోయింది త్వరలోనే వస్తాను" అన్నాడు తల్లి మూడ్స్ చూస్తే కాఫీ సంగతి దేవుడెరుగు, మంచినీళ్లు యిచ్చే స్థితిలో కూడా లేదు ఆమెను అడిగితే రెచ్చిపోయి, ఏదయినా అంటే బావుండదని ఊరుకున్నాడు

రూప మరోసారి నమస్కరించి లేచింది ఆమె ముఖం వచ్చినప్పటి వున్నంత ప్రసన్నంగా లేదు తల్లి ప్రవర్తనకు బాధపడిందని అర్థం అయింది తమ మధ్య జరిగిందేది తల్లికి తెలియదు అలాంటప్పుడు ఆమె బాధపడటంలో, అభావంగా వుండటంలో తప్పేమి లేదని అనుకున్నాడు బయటివరకు వెళ్లి సాగనంపి వచ్చాడు

"ఇదో తంతు మనిషి మూర్ఖుల్ని చెయ్యటానికి ఉన్నవాళ్లు కదా, ఏదన్నా సాగుతుందని నమ్మకం" జయమ్మ ఈసడించింది. పూర్ణ ఏదో అనబోయి అన్న రావటం చూచి ఊరుకుంది ఇంద్రమోహన్ ఇరకాటంలో పడ్డాడు.

"ఇంద్రా! వాళ్లు డబ్బున్నవాళ్లు అయితే ఆ డబ్బు వాళ్ల దగ్గరే వుంచుకొమ్మను. అవమానించటం, అభిమానించటం, అన్నీ వాళ్ల హక్కే అనుకుంటే యెలా? జరిగిందేదో జరిగిపోయింది మళ్లీ ఆ లంపటం యెందుకు? మీ నాన్నను వెళ్లి ఈ డబ్బు వియ్యంకుడికి యిచ్చి రమ్మను..." అన్నది, డబ్బు జాగ్రత్త చేస్తూ.





"ఏం సినిమాలో ?....
ఏం పత్రికలో ?....
....ఛస్తున్నాం బాబూ !!"

"ఉష్! డబ్బు దగ్గరుంటే వాన్నకు ఆపత్‌బాంధవులు ఎక్కువ అవుతారు ఆదివారం నేనే యిచ్చి వస్తాను" అన్నాడు

"ఉహుఁ! డబ్బుంటే ఏదయినా అవసరం వస్తుంది రేపు నేను పూర్ణ నెడతాం వియ్యాలవారి దగ్గరకు" అన్నదామె ఆదీ నిజమే అనిపించింది. మధ్యతరగతి ప్రణాళికలు, అవసరాలు అలాంటివి. ఎవరూ ఏం చేయలేరు పది రూపాయలు దాచుకుందాం అనుకుంటే ఇరవై రూపాయల ఖర్చు వస్తుంది అందుకే తల్లి ప్రతిపాదనకు మౌనము వహించాడు ఇంద్రమోహన్. రామలింగంగారి గుర్రు మాత్రం లయబద్ధంగా వినిపిస్తుంది. అందరూ ఆయనలాంటి అదృష్టవంతులు వుంటే బావుండును, నిశ్చింత ఆయనకు పెట్టని ఆభరణం

## 24

రూపాదేని ఆయోమయంగా చూచింది అనుకోని అభియోగానికి త్వరగా వెళ్లి పేషెంటును చూద్దామన్నా అతడిని హైద్రాబాద్ తీసుకు వెళ్లారు. ఆమెకు కనీసం తెలియజేయనయినాలేదు. రియాక్షన్ రియాక్ట్ అయిందట

"పాత స్టాక్ పెట్టి మా ప్రాణాలు తీస్తారా! అందుకే లక్షలకు లక్షలు సంపాదిస్తారు మేడమీద మేడ కడతారు" ఇష్టంవచ్చినట్టు మాట్లాడు తున్నాడు పేషెంటు తాలూకు మనిషి. విహ్వల ఆయి చూస్తుందామె ఒకవంక తన నిర్లక్ష్యంవల్ల ప్రాణంమీదికి వచ్చిందే అన్న బాధ, మరొకవంక అతని మాటలకు జవాబు యివ్వలేని అసహాయత ఆమెను కృంగదీస్తున్నాయి.

"అతను క్షేమంగా వుంటే సరేసరి. లేకుంటే మీ నర్సింగ్‌హోమ్ నేలరాస్తాము..."

నర్సులు, బాయిస్ తమాషా చూస్తున్నారు.

"ఆవిడిచ్చిన మందేనన్న నమ్మకం ఏమిటండీ! దబాయించి మాట్లాడుతున్నారు." అప్పుడే అక్కడికి వచ్చిన ఇంద్రమోహన్ అడిగేసరికి తెల్లబోయాడు అతను.

"నువ్వెవరు ?"

"పేషెంటుకు నువ్వు ఎవరో, ఈ ఆస్పత్రికి, డాక్టరుగార్కి నేమా అంతే తెలిసిందా ?"

"మీరిచ్చిన మందుకాక, మరేదయినా వేసుకునే అవకాశముందా ?" అతను కోపంగా అడిగాడు

"ఎందుకులేదు ? తెలిసి, తెలిసి ఏ డాక్టరు తన రోగిని చంపాలని అనుకోడు నర్స్ ఒకసారి స్టాక్ చెక్ చేయండి" అన్నాడు.

ఇద్దరూ లోపలికి వెళ్లి వున్న మందులు చూశారు. ఎక్కడా అవక, తవక లేదు. తారీఖు దాటిన మందులు లేవు రోగి గది నుండి తెచ్చిన మాత్రలపై అసలు డేట్ లేదు

"ఇవి ఎక్కడివి ?" కోపంగా అడిగాడు ఇంద్రమోహన్

"ఆస్పత్రిలోనే ఇచ్చారు..." నీళ్లు నమిలాడు అతను

"ఇక్కడ నీ రోగికోసమే డేట్ ఎక్స్‌పయిరీ అయిన మందులు పెట్టారా! మరో గంటలో తేలుస్తాను మందులెక్కడివో..." అన్నాడు.



"రామచిలక" లో వాణిశ్రీ

తన బుర్రంతా మొద్దుబారిపోయినట్టు, బేలగా చూస్తూ కూర్చుంది రూపాదేవి. ఆమెకంతా ఆయోమయంగా వుంది ఆమె మంచితనాన్ని ఆసరాగా చేసుకుని, ఇష్టరాజ్యం ఏలుతున్న స్టాఫ్ ఏం జరుగుతుందోనని ఉబలాటంగా చూస్తున్నారు.

"నర్స్! మీ మేనేజరుగారి గది తాళాలు వున్నాయా ?"

"చూస్తాను..." తేలు కుట్టిన దొంగలా తాళాలు తీసి ఇచ్చిందామె. రూపాదేవి చిత్రంగా చూచింది. అతని గది తాళాలు ఆమె దగ్గర కెలా వచ్చాయో అర్థం కాలేదు ఇంద్రమోహన్‌ని అనుసరించింది.




—పై ఫొటో ఎన్. శివనారాయణ —








## గ్రీటింగ్స్ టు వినాయక

లమ్మో ఇగి ఇన్నారా! బాబో ఇది ఇన్నారా! నెను, నేనండీ, పువ్వుల పున్నయ్యనండె నేను గీటింగ్స్ పంపించానండె. ఎవరికనడగరేం! ఇనాయకుడికండె. ఎలా పంపానని అడగరేం! టెలిగావ్ పారవ్ మీద రాసి పంపానండి. ఏవని అడగరేం. ఇష్ యు ఎ యాపీ బరతుడే అని రాసి పంపానండి. తప్పాండీ! తప్పయితే చెమించండి. ఇనాయకులచామే! ఈ పున్నయ్యను మరసిపోకు చామె అడరసు ఏమి రాశానో సెప్పేదాండె "ఇనాయకులుచామి, చివయ్య కొడుకు, కయిలాచం'

పువ్వుల పున్నయ్య
కెరాఫ్ మాడా వెంకటేశ్వరరావు, మద్రాసు

## దిష్టి తొలగిందా? సిద్ధి కలిగిందా?

అమ్మాయ్! గత సంవత్సరం మీ ఆయన మీద, నీమీద బోలెడంత దిష్టుందని నాతో మొరపెట్టుకున్నావ్. ఎలా వున్నారిపుడు.

నీ బ్లెస్సింగ్స్ వల్ల కొంతవరకూ ఫరవాలేదు స్వామీ! మా విషయం అలావుంచండి! మీరెప్పుడొచ్చారు ఈ లోకం. వచ్చి కొన్నిరోజులైంది. ఒకరిద్దర్ని కలవడం కూడా జరిగింది. మొన్ననే మీ ఆయన్ను గూర్చి ఓ పెద్దమనిషి నడిగాను. శరత్‌బాబు కేమండీ! తమిళ చిత్రాల్లో తెగనటించేస్తున్నాడు. చాలా తెలుగు చిత్రాల్లో కూడా వున్నాడు. మరొక గుడ్ న్యూసండీ. ఇటీవల రిలీజ్ అయిన "ముళ్ళుం – మలరుం" అనే తమిళ చిత్రంలో శరత్‌కు చాలా మంచి పేరొచ్చిందండీ అని చెప్పాడు. ఆ మాట విని ఆనందించాను. కంగ్రాట్స్ చెప్తామనే వచ్చాను. సర్వదా కృతజ్ఞులమండీ! ఎవరెన్ని అనుకున్నా. సిద్ధి వినాయకుడివి నీ కటాక్షం మాకుంటే చాలు. దిష్టి పోతుంది. సిద్ధి కలుగుతుంది

(పై ఊహాగాన సంభాషణం హాస్య నటి రమాప్రభకు వినాయకుడికి మధ్య జరిగింది)

— [జనప్రియ]

---

## మోహనరూప

"తాళాలు నర్స్ దగ్గరుంటాయని మీకెలా తెలుసు!"

"కొన్ని విషయాలు వాచ్‌మెన్ చెప్పాడు వాటి నాధారంగా చేసుకుని ఉండవచ్చునని ఊహించాను నా ఊహ సరియైనదే" చిన్నగా నవ్వాడు

ఆమె అయోమయంగా చూచింది ఏమిటో అంతా సాలెగూడులా ఉంది

"చూడండి రూపాదేవి, మనిషి జీవితంలోని సంఘటనలు చీకటి వెలుగుల్లా ఒకటి చెడు, ఒక మంచి వెన్ను అంటే ఉంటాయి డాక్టరంటే దేవుడనుకుని కొలిచినప్పుడు ఆనందపడతాం అలాగే కొన్ని రోగాలు మన చేయిదాటి వెళ్లిపోయాక, ఆ రోగి తాలూకువాళ్లు శపిస్తారు అది మానవ నైజం"

"అది నిజమే నా పొరపాటు ఏంలేదని తెలిసి యెలా సరిపెట్టుకోను!" రూపాదేవి మధ్యలోనే త్రుంచివేసింది

"పొరపాటు లేదనగానే సరిగాదు ఎక్కడో మనవల్ల జరిగి ఉంటుంది అందుకే నిందలు వచ్చినప్పుడు ఆనందించమని చెప్పటంలేదు ధైర్యంతో నిలబడమని చెబుతున్నాను" అన్నాడు

నర్స్ ఇబ్బందిగా కదులుతుండగా దామోదర్ వాడే గది తీశాడు ఇంద్రమోహన్ రూపాదేవి గదిలోకి తొంగిచూచి, ఏహ్యంగా, ఇబ్బందిగా చూస్తూ ఆగిపోయింది ఒకప్పుడు ఆశ్రమ కుటీరంగా ఉండేది ఆ గది తలుపు కెదురుగా బోసినవ్వులు కురిపించే పాపాయి బొమ్మ ఉండేది దాని స్థానములో అర్ధనగ్నంగా అసహ్యమైన భంగిమలో ఉన్న నర్తకి కేలెండర్ ఉంది తెల్లటి, మల్లెపువ్వు లాంటి దుప్పటి పరిచి ఉండే మంచంనిండా చీట పేకలు, స్కోర్ వ్రాసుకున్న కాగితాలు, ఖాళీ సిగరెట్టు పెట్టె పడి ఉన్నాయి నేలమీదయినా నిస్సంకోచంగా కూర్చోవటానికి అనువుగా, శుభ్రంగా ఉన్న గది నేల, సిగరెట్టు పీకలతో అగ్గిపుల్లలతో అసహ్యంగా అడుగు పెట్టటానికి వీలులేనట్టు ఉంది

"ఇక్కడ పేకాట యెవరు ఆడుతారు నర్స్!" రూపాదేవి అడిగింది కోపంగా

"నాకేం తెలుసు!. రోగుల తాలూకేమో కాదు దామోదర్‌గారి స్నేహితులేమో." అన్నది తడబడుతూ రూపాదేవి కోపంగా ఇటు తిరిగింది

శుభ్రంగా తుడిచిన స్టౌ, మంచినీళ్ల కూజా, హార్లిక్స్ సీసాల్లో నింపిన సరుకులుండేచోట బీర్ బాటిల్స్, చిప్స్ పాకెట్స్ ఉన్నాయి ఇంద్రమోహన్ వెళ్లి అతని మంచం క్రిందినుండి ఓ కర్టెన్ లాగాడు అందులో చాలా రకాల మందులున్నాయి

"ఇదిగో ఇక్కడో అనుబంధ క్లినిక్ నడుస్తుంది" అన్నాడు

[39 వ పేజీ చూడండి]


గిరిబాబు సమర్పించు
జయభేరి
ఇంటర్‌నేషనల్
నటశేఖర కృష్ణ నటించు
సింహగర్జన
స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: కొమ్మినేని
ఈస్ట్‌మన్ కలర్ స్కోప్
నిర్మాతలు:
నిర్వహణ:
మాగంటి వెంకటేశ్వర రావు, యర్రా శేషగిరి రావు, అన్నంగి నాగేశ్వర రావు

# జి. ఐ. జి. పేజీ

**ఒక చిత్రం పాట మరో చిత్రంలో**

"కా స్మే వా డే" చిత్రానికి నీతూసింగ్, రణధీర్‌కపూర్‌లమీద చిత్రీకరింపబడిన ఓ పాటకు నిడివి ఎక్కువైనందున ఆ చిత్రంలో చోటు లేకపోయింది కాని, రికార్డ్‌గా వెలువడింది ఇప్పుడదే పాట ఆ నాయికా నాయకులే నటిస్తున్న "బాల మసున్" అనే చిత్రంలో చేర్చబడింది రెండు చిత్రాలకూ సంగీత దర్శకుడు ఒకడే అవడంవల్ల ఈ ఏర్పాటు జరిగింది

"మా నాన్న తీసిన ఒకే ఒక చెత్త చిత్రం 'బాబీ' ... ఆ చిత్రంలో ఉత్తమ నటుడుగా కొందరు ఎన్నుకున్న మా తమ్ముడు ఋషికపూర్ అంతకన్నా చెత్త నటుడు," అంటాడు రణధీర్‌కపూర్

స్కూల్లో చదువుకుంటూండగా సినిమాలో నటించినందుకు బర్తరఫ్ చేయబడ్డాడు ఋషికపూర్ "మేరా నామ్ జోకర్"లో నటించినందుకు ఛాంపియన్ స్కూల్ నించి తొలగించబడ్డాడు "బాబీ" చిత్రం తొలి ప్రదర్శనలో వసూలైన మొత్తాన్ని ఛాంపియన్ స్కూల్ భవన నిధికి అతని తండ్రి రాజ్‌కపూర్ విరాళంగా ఇచ్చాడు. ఆ సందర్భంలో ఆ స్కూల్‌కు ముఖ్య అతిథిగా ఆహ్వానింపబడింది ఋషికపూరే!

**రీ రికార్డింగ్ ఎఫెక్ట్**

ఒక మలయాళ చిత్రం రీ రికార్డింగ్ జరుగుతోంది ఒక మసీదు దృశ్యంలో "నాకిక్కడ పావురాళ్ళ రెక్కల చప్పుడు లాంటివి కావాల,' అన్నాడు డైరెక్టర్ జయకాంతన్

"ఆ దృశ్యంలో పావురాళ్ళు లేవే!" అన్నాడు సంగీత దర్శకుడు

వెంటనే జయకాంతన్ "మీరు తరచు వయొలిన్ వాద్యం నేపథ్యంలో వినిపిస్తుంటారే— అప్పుడు తెరమీద వయొలిన్లు కనిపిస్తుంటా యేమిటీ?" అన్నాడట

**ఇతర భాషా చిత్రాలలో తెలుగు తారలు**

తెలుగుకన్నా ఎక్కువగా తమిళ, కన్నడ, మలయాళ చిత్రాలలో నటించే ఇద్దరు తారలను ఇటీవల కలుసుకోవడం జరిగింది. ఒకరు హేమాచౌదరి, మరొకరు సత్యప్రియ.

"దేవదాస్‌గారి దర్శకత్వంలో నేను నటించిన 'నిజం' చిత్రం త్వరలో విడుదలవబోతోంది," అంటూ హేమ ఒక విషయం తెలియజేశారు "నేను 'పొరుగింటి పుల్లకూర' కన్నడ చిత్రంలో జయచిత్రగారి పాత్రను నిర్వహించాను ప్రసాద్ స్టూడియోలో షూటింగ్ జరుగుతూండగా ఒకరోజు సెట్‌కు వచ్చిన సత్యజిత్‌రాయ్‌గారు 'వెరీగుడ్! ఫస్ట్ టేక్ ఓకే అయ్యేలా చాలా బాగా చేశావు. కన్నడం నాకు తెలియకపోయినా నీ డైలాగ్ డెలివరీ, ఎక్స్‌ప్రెషన్స్ ఎక్కువగా వున్నాయి,' అన్నారు అంతటి గొప్ప దర్శకుని ప్రశంస పొందడం - నా జీవితంలో మరపురాని విషయం."

"మీ జీవితంలో మరపురాని విషయమేమిటి?" అని సత్యప్రియను అడిగాను

"బి. యే, అయ్యాక ఎం ఎ ఏడాదిపాటు వెలగబెట్టాను ఇంతలో సినిమా ఛాన్సు రావడంతో నా చదువుకు ఫుల్‌స్టాప్ పెట్టేశాననుకోండి ఎం. ఎ. ఫస్ట్ ఇయర్‌ను 'సోషల్ సర్వీస్'తో పూర్తిచేశానన్నమాట .. విశాఖపట్నం జెయిల్లో కొందరు ఖైదీలకు పంతులమ్మగా పని చేశానప్పుడు ఒక ఖైదీకి స్కూల్‌ఫైనల్ పూర్తిచేయాలని పించింది. బాగా తర్ఫీదు యిచ్చాను చివరకు పాసయ్యాడుకూడా అతను కృతజ్ఞతాపూర్వకంగా నాకు మిఠాయి ఇవ్వబోతూంటే — అప్పుడతన్ని అడిగాను — అతను యావజ్జీవ కారాగార శిక్ష అనుభవించడానికి కారణమేమిటని అతని అన్న చనిపోయాక వదినతో అక్రమ సంబంధం పెట్టుకున్నాడట ఆమె మరొకతని ప్రేమలో పడింది. అది భరించలేక ఆవేశంతో ఆమె ప్రియుణ్ని హతమార్చాడట ఆవేశంలో తొందరపడి చేసిన పనికి తానిప్పుడు శిక్ష అనుభవిస్తున్నట్లు అతను పరితప్త హృదయంతో చెబుతూంటే నా కళ్ళు చెమ్మగిల్లినంత పనైంది," అని వివరించిన సత్యప్రియ అసలు పేరు సత్యవతి




'ముగ్గురు మూర్ఖురాండ్రు'లో జయమాలిని

**అనుకున్నది సాధిస్తా**

కారు మలుపు తిరిగి వచ్చి కొండగుర్తుగా వున్న ఒక మైలురాయి దగ్గిర ఆగింది. అందులోంచి బ్రీఫ్‌కేస్‌తో రాధ దిగింది. చుట్టూ ఎత్తయిన ప్రదేశంలో నాగరాజా అనుచరులు వున్నారు

''ఏమిటి నువ్వొచ్చావ్?'' అన్నాడు నాగరాజా.

''ఎవరొస్తేయేం? నీక్కావలసింది డబ్బే కదా?'' అంది రాధ.

''లేదా – నీ మొగుడి ప్రాణం''

''ఎందుకనవసరంగా ఆవేశపడతావ్? డబ్బు తెచ్చాను తీసుకో!''

''వెరీగుడ్! లక్ష తీసుకొచ్చావుగా?''

''ఎక్కువే వుండొచ్చు. లెక్కపెట్టుకో.''

నాగరాజా ఆ పెట్టె తెరిచి చూసేసరికి శిరోజాలు కనిపించాయి ''ఏమిటిది?'' అరిచాడు.

''కనబడ్డంలా? నీ అతితెలివికి నా కానుక. మర్యాదగా చెప్తున్నాను. ఇంతకుమించి ఆశలు పెట్టుకోకు. మళ్ళీ నా భర్త జోలికి వచ్చావో – నిన్నేం చేస్తానో నాకే తెలీదు,'' అంటూ రాధ కారులో ఎక్కబోగా నాగిరాజు అనుచరులు కత్తులతో ఎదుర్కొన్నారు. హోరాహోరీ పోరాటంలో వాళ్ళందర్నీ రాధ చిత్తుగా కొట్టింది. దూరం నుంచి నాగరాజు రివాల్వర్ గురిపెట్టేలోగా రాధ చిహాలున తన పాంట్ జేబులోంచి పిస్టల్ తీసి పేల్చింది. రివాల్వర్ కిందపడిపోవడంతో నాగరాజుతో పాటు అతని అనుచరులు చల్లగా కాళ్ళకు బుద్ధిచెప్పారు. రాధ విరగబడి నవ్వింది.



'మనవూరి పాండవులు...'

లత, గిరిబాబు పాల్గొన్న భాగ్యనగర్ స్టూడియోస్ ''అనుకున్నది సాధిస్తా'' చిత్రానికి రాజశ్రీ రచయిత, రమేష్‌నాయుడు సంగీత దర్శకుడు. లక్ష్మణ్‌గోరే ఛాయాగ్రాహకుడు. మన్నె రాధాకృష్ణ సహకార దర్శకుడు. స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: పి. చంద్రశేఖరరెడ్డి. నిర్మాత: బొదం రామస్వామి.

[32వ పేజీ చూడండి]







# వానలు! వరదలు!!

శ్రావణం తొంగి చూస్తూనే గంగమ్మ నుంచి కృష్ణమ్మదాకా బ్రహ్మపుత్ర నుంచి గోదావరయ్య దాకా అన్ని నదులూ పొంగి పొర్లిపోయాయి! ఇది చూసి, మింటికి మంటికీ ఏకధారగా కురిసిన అతివృష్టి ఆధారంగా వాగులు—వంకలు, చెర్వులు—మడుగులు, కాల్వలు—మురుక్కాల్వలు కూడా పొంగి పొర్లిపోయాయి! నదులు కట్టలకు గండ్లు పెట్టాయి – పేదసాదలకు కడగండ్లు వచ్చి పడ్డాయి! 'పంట' వానలకి 'కొట్టుకు' పోయింది!

ఇదీ పవిత్ర భారతదేశ దృశ్యం!

ఐనా పిల్లలికేంతెల్సు బడి లేదుగా... కాయితం పడవలాటలలో కేరింతలు కొడుతున్నారు.









పనిపాటలు లేవు - చిన్న వ్యాపారాలు లేవు — పంచపాళీలో ముడుచుకు కూర్చోవడమే పని!

ఐతే - టీ 'కొట్టద్బి'కి ఎక్కడకిపడితే అక్కడికి పోయి అమ్ముతాడు గనుక అంతా గిరాకీయే!





# సినిమా జోకాయణం



**రాజ్‌బాబు**

వినాయకుడికి మూషికము, సుబ్రహ్మణ్యస్వామికి నెమలి, శివునికి నంది, విష్ణువుకు గ్రద్ద, దేవేంద్రునికి ఐరావతము, యమధర్మరాజుకు ఎనుబోతు, శనీశ్వరుడికి కాకి, రాజరాజేశ్వరీదేవికి సింహము ఇలా దేవతలందరికీ వాహనాలున్నాయి మనిషిని మాత్రం ఎవ్వరూ వాహనంగా ఎందుకు పెట్టుకోలేదో — తెలుసా ? హఠాత్తుగా ఎప్పుడైనా సమ్మె చేస్తారేమోనని కాబోలు !

**రావుగోపాలరావు**

"ఏమిటయ్యా, రైలు పట్టాల మీద పడుకున్నావు ?"

"నాకు జీవితం మీద విరక్తి కలిగింది నేనాశించింది ఒక్కటీ నెరవేరలేదు "

"ఇది కూడా నెరవేరదు ఈవేళ రైల్వే లోకోషెడ్‌లో సమ్మె అట "

**రావికొండలరావు**

"మీ తమ్ముడు చిన్నప్పుడు నిక్కర్లు తొడుక్కుంటూండేవాడు ఇప్పుడేం చేస్తున్నాడా వెధవ ?"

"ఇప్పుడు కూడా నిక్కర్లే తొడుక్కుంటున్నాడండి వాడు డ్రిల్లు మాస్టరు "

**బాలకృష్ణ**

"ఈ వడ ఏమిటోయ్ రాయిలా వుంది దీన్ని మీ ప్రొప్రయిటర్ దగ్గిరికి తీసుకెళ్ళి, ఆయన్ని తిని చూడమని చెప్పు "

"అలాగేనండి," అంటూ సర్వర్ ఆ ప్లేట్‌ను తీసుకెళ్ళి, కాస్సేపటికి ఖాళీ ప్లేట్‌తో తిరిగొచ్చాడు

"ఆ వడను మీ ప్రొప్రయిటర్ తిన్నాడా ?"

"ఇంకా కాస్సేపవుతుందండి ఈలోగా — మీలాగే ఎవరో పంపించిన మైసూర్‌పాక్, వెజిటబుల్ ఆమ్లెట్‌ను ఆయన తినాలి ముందు," అని జవాబిచ్చాడట ఆ సర్వర్

**నాగభూషణం**

ఇద్దరి మధ్య ఏదో తగాదా వచ్చింది మధ్యవర్తిగా ఒక పెద్దమనిషిని ఆహ్వానించారు. మొదటి వ్యక్తి చెప్పిందంతా విని, "నీది రైటే !" అన్నాడా పెద్దమనిషి. రెండో వ్యక్తి చెప్పింది విన్నాక "నీదీ



← రమాప్రభ

రైటే !" అన్నాడు. ఇదంతా గమనిస్తూన్న మరో పనిలేని పుల్లయ్య "ఇద్దరిదీ రైటెలా అవుతుందండి?" అని అడిగితే, "నీదీ రైటే !" అన్నాడట ఆ పెద్దమనిషి.

**సాక్షిరంగారావు**

"అయ్యా, వకీలుగారూ ! ఈ కేసులో మనం జయించడం ఖాయం. జడ్జిగారికి లంకపుగాకు చుట్టలంటే చాలా ఇష్టంకదా ? అందుకని నిన్న ఒక పెట్టెనిండా చుట్టలు పెట్టి పార్సిల్ పంపించాను."

"కొంపముంచావయ్యా ! ఆ జడ్జిగారు చాలా నికార్సయిన మనిషి. ఆయనకు నువ్వు లంచమివ్వబోతావా? నీ గతి ఏమవుతుందో తెలుసా ?"

"ఆమాత్రం తెలీదటండీ ? పార్సిల్ లేబిల్ మీద నా పేరు రాయిస్తానా ? మన విరోధులు పంపినట్లు రాయించాను."

**పొట్టిప్రసాద్**

"మీ ఇంట్లో ఏదో కమ్మని వాసన వేస్తోందేమిటి ?"

"నాలుగు సెంట్ల గ్రౌండ్‌లో కట్టించాను కదండీ ? ఆ సెంట్ల వాసనేమో !"

**కె. కె. శర్మ**

"మీ ఇల్లు బాగా కట్టించారేగాని, గోడలకు మంచి పెయింట్ పూయించకపోయారా ?"

"పూయించానయ్యా. వాళ్ళకు డబ్బు చెల్లించకపోయేసరికి పూసిన పెయింట్‌నంతా గీకుకొని వాపసు తీసుకెళ్లిపోయారు "

**పద్మనాభం**

ఒక పిచ్చివాడు "నీ భార్య ఉన్నట్టుండి వితంతువైతే నువ్వెక్కడ భోంచేస్తావురా ?"

రెండోపిచ్చివాడు "హోటల్లో!"

మూడో పిచ్చివాడు "నేనయితే చక్కా మళ్ళీ పెళ్ళి చేసేసుకుంటాను."

**రమాప్రభ**

పిచ్చాసుపత్రిలో ఇద్దరు పిచ్చి వాళ్ళు —

"ఈ వేళ కొత్త డాక్టర్ వచ్చినట్లున్నాడే! మరి, పాత డాక్టర్ ఏమైనట్లు ?"

"ఆయనకు జబ్బు నయమై ఉంటుంది. ఇంటికి పంపించేసి ఉంటారు."

**నాగేష్**

"హాయిగా నడిచివెళ్లకుండా ఈ కారు ఎందుకండి? భగవంతుడు మనకు రెండు కాళ్ళు ఇచ్చిందెందుకు ?"



"ఒక కాలితో ఆక్సిలేటర్ తొక్కడానికి, మరొక కాలితో బ్రేక్ వెయ్యడానికి "



**అల్లురామలింగయ్య**

ఒక ప్రొఫెసరు ఏదో పెద్ద హోటల్‌కు వెళ్ళాడు వెయిటర్ 'మెను' కార్డును తెచ్చి టేబుల్‌మీద వుంచాడు ఆ ప్రొఫెసర్ కళ్ళజోడును ఇంటివద్దే మరచి వచ్చాడు అంచేత "ఇందులో ఏం రాసి వుందో నువ్వే చదువయ్యా !" అన్నాడు దానికా వెయిటర్ "మీలాగే నాక్కూడా చదువు రాదండి లేకపోతే ఇక్కడెందుకు వెయిటర్‌గా పని చేస్తాను ?" అన్నాడట

**సూర్యకాంతం**

"బి ఎ పూర్తిచేశావని తెలిసింది చాలా సంతోషం నాయనా ! ఇంతకీ, ఇప్పుడేం చేస్తున్నట్లు ?"

"మా నాన్నగారికి సహాయంగా ఉన్నాను "

"అలాగా ! ఆయనేం చేస్తున్నారేమిటీ ?"

"ఇంట్లో గోళ్ళు గిల్లుకుంటూ కూర్చొనున్నారు "

**ఛాయాదేవి**

"నేనొక రసాయనాన్ని కని పెట్టాను అది ఎంత శక్తివంతమైనదంటే దాన్ని ఏ పదార్థం మీద వేసినా — అది కాస్తా ఇట్టే కరిగిపోతుంది "

"మరి, ఆ రసాయనాన్ని ఎందులో నిలువచేసి ఉంచుతారేమిటీ ?"

**రాధాకుమారి**

ఒక పిసినారి ఒక్క పైసాకు చెక్కు రాసి, దాన్ని తీసుకెళ్లి బాంక్ కేషియర్‌కు ఇస్తే, అతగాడు ఆ చెక్కువంక ఎగాదిగా చూసి, "ఆ పైసాను బొమ్మగా ఇవ్వమంటారా, బొరుసుగా ఇవ్వమంటారా ?" అని అడిగాడట

— జి వి జి


అందరిని నడిపే ఆ దేవుడు
అప్పుడప్పుడు తప్పు చేసినా
తొందరగా తెలుసుకుని
ఆ తప్పుని దిద్దుకుంటాడు
ANNAPURNA KALANIKETAN
అన్నపూర్ణా కళానికేతన్ వారి
రాధాకృష్ణ
ఈస్ట్‌మన్ కలర్
నిర్మాత: దుక్కిపాటి మధుసూదనరావు B.A.,
దర్శకత్వం: కె. రాఘవేంద్రరావు B.A.,
కథ: సులోచనారాణి
ఛాయాగ్రహణం: విన్సెంట్
సంగీతం: రాజేశ్వరరావు
నవయుగ

ఇదేమిటిది? ఇదీ శ్రావణమాసం జల్లే?!

# సినిమా విశేషాలు



'చెప్పింది చేస్తా' లో

### పులిగా ప్రవర్తిస్తున్న దర్శకుడు

కౌముదీ పిక్చర్స్ నిర్మిస్తున్న "రామబాణం" స్కోప్ వర్ణ చిత్రానికి మొదటి షెడ్యూలు పదిహేను రోజులు జరిగింది తొలి షెడ్యూలులో వచ్చిన రషస్‌ను, నిర్మాత శ్రీ ఎమ్. ఎస్ రెడ్డి తదితర ప్రముఖులు కొందరు చూశారు

కొత్త దర్శకుడు శ్రీ ఈశ్వరరెడ్డిని "పులి" అని శ్లాఘించారు తెలుగు తెరకు ఒక ఉత్తమశ్రేణి దర్శకుడిని పరిచయం చేస్తున్న, శ్రీ ఎమ్. ఎస్ రెడ్డిని అందరూ అభినందించారు.

"రామబాణం" చిత్రంలో నటిస్తున్న శోభన్, కృష్ణంరాజు, జగ్గయ్య, సత్యనారాయణ, జయప్రద, జమున, లత, మోహన్‌బాబు, ప్రభాకరరెడ్డిగార్లు ఈశ్వరరెడ్డి సామర్థ్యాన్ని ప్రశంసించారు

### శోభన్‌తో రెండేసి చిత్రాలు

"అందగాడు" శ్రీ శోభన్‌బాబుతో రెండేసి చిత్రాలను యిద్దరు నిర్మాతలు తలపెట్టారు. ఒకరు సురేష్ అధినేత శ్రీ రామానాయుడు, మరొకరు కౌముదీ నిర్మాత శ్రీ ఎం. ఎస్ రెడ్డి

శ్రీ రామానాయుడు నిర్మిస్తున్న "ఎంకి... నాయుడుబావ", "రాముడు ... పరశురాముడు" చిత్రాలు శ్రీ ఎం. ఎస్ రెడ్డి నిర్మిస్తున్న "రామబాణం", "మాణిక్యవీణ" చిత్రాలు.

శోభన్‌బాబుగారికి ఆత్మీయుడు అని పేర్కొనదగిన ఒకే ఒక వ్యక్తి శ్రీ చటర్జీ. సమత బ్యానరులో రూపొందే చిత్రాలలో శోభన్ తప్ప మరొకరు నాయకుడుగా వుండరేమో!

### డి. వి. ఎస్. రాజుకు దాసం చెప్పిన కథ

విఖ్యాత చిత్ర నిర్మాత శ్రీ డి వి ఎస్. రాజుకు, రచయిత శ్రీ దాసం గోపాలకృష్ణ ఒక రసవత్తరమైన కథను చెప్పారు. ఆ కథను దర్శకుడు శ్రీ విశ్వనాథ్, నిర్మాత శ్రీ రాజు ఎంతో లైక్ చేశారు.

"చిల్లరకొట్టు చిట్టెమ్మ" కన్నా యెన్నో రెట్లు మిన్నగా వుండే ఆ కథకు శ్రీ దాసం యిడిన పేరు "ప్రెసిడెంట్ పేరిందేవి"

ఈ పాత్ర ఎవర్ని వరిస్తుందోగాని ... ఆమెకు మరో అయిదేండ్లు పరిశ్రమలో స్థిరనివాసం తథ్యము అనే చెప్పాలి




## ట్రంకాల్ టు వినాయక!

ఈజ్ ఇట్ శక్తి వినాయక టెంపుల్? యస్ కెన్ ఐ స్పీక్ టు గాడ్ వినాయకా! నో, నో హీజి వెరి బిజి మన్నించండి ఆయన భక్తుడు సారథి ఫోన్ చేశాడని చెప్పండి ఉండండి అడిగి చెప్తాను తొందరగా కానివ్వండి. ట్రంకాల్ రేటు ఎక్కువైపోతుంది కనెక్షన్ ఇచ్చాను మాట్లాడండి నమస్తే వినాయక్ జీ! ఈ కో—కో—పా గుర్తున్నానా! భలేవాడివయ్యా! భక్తుడ్ని మర్చిపోతానా! ఏమిటి విషయం? నవరత్నాలతో విప్పర్పించే రోజులింకా రాలేదు నాకు అందుకే నిండుమనసుతో స్వయంగా నీ పుట్టిన దినం సందర్భంగా నమస్కారాలందచేసి దీవెనలందుకుంటామని ఫోన్ చేశాను. చాలా థాంక్స్. నా ఆశీర్వాదం నీ కెప్పుడూ వుంటుంది ప్రొసీడ్.

## పార్సిల్ టు వినాయక!

డియర్ వినాయకా! నీ పేరిట పార్సిల్ ఒకటి పంపిస్తున్నాను చంద్రుడికో నూలుపోగులా నా ఈ చిన్ని కానుకను స్వీకరించు స్వామి కె వి చలం, ఏమిటిదంతా! ఎందుకిదంతా అని అడక్కు భట్ల బంగారం పంపిస్తున్న ఆ బట్టల్ని నీ భక్తుడి ప్రేమకానుకగా, నీ బర్త్‌డే సందర్భంగా తీసుకోవలసినదిగా ప్రార్థిస్తున్నాను నీ సమ్మతి తెలియాలనే రిప్లైకార్డు వ్రాస్తున్నాను ఆలస్యం చెయ్యకుండా వెంటనే బదులు వ్రాయి

ఇట్లు,
నీ భక్తుడు, కె వి. చలం.




## అమ్మా! అడ్రసు మారిందా!

ఎంతమాట అన్నీ తెలిసే నువ్విలా అడగడం ఏం బాగుందయ్యా! నిజంగా తెలియదమ్మా! దేవలోకంలో వుండేపుడయితే అక్కడ్నుంచే నా భక్తుల్ని పరోక్షంగా చూస్తూ దీవిస్తుండేవాడ్ని. కానీ ఈమధ్యనే నేను మీ లోకానికొచ్చాను ఇంతక్రితమే జయచిత్రను కలిసాను నీ అడ్రసడిగితే కొరిచ్చి నన్నిక్కడికి పంపించింది నీ "సినిమా" ఒకటి చూడాలని ఆశగావుంది నాకు "శివరంజని" సినిమా చూడయ్యా! ఎప్పుడు? కొన్నాళ్ళ ఓపికపట్టు తప్పకుండా. నేనెలాగూ కొన్నాళ్ళ యిక్కడ వుండివెళ్లాలనే నిర్ణయించుకున్నాను కనుక సినిమా చూసితీరుతాను. అందరూ క్షేమమే గదా! నీ ఆశీర్వాదబలంతో ఏదో వున్నాం. అన్నీ బాగానేవున్నాయిగానీ! త్వరలోనే పుట్టినదినం వస్తుంటే! అపుడు మీ లోకంలో వుండక ఇక్కడుంటావా! అబ్బెబ్బె అలాంటిదేమీలేదు చతుర్థినాటికి అక్కడికి చేరుకుంటాను అందుకే అడ్వాన్స్‌గా వచ్చాను మరి మళ్లీ కలవనా! అన్నట్టు మర్చిపోయాను. అడ్రసు చెప్పు. నోట్ చేసుకుంటాను శ్రీమతి జి. నిర్మల, 79, బజుల్లా రోడ్, టి నగర్, మద్రాస్ – 17.

[ పై ఊహాగాన హాస్యరస సంభాషణం శ్రీమతి నిర్మలకు, వినాయకుడికి మధ్య జరిగింది ]

## మనిషి పేరూ నిర్మలమే, మనసూ నిర్మలమే

ఆమె పేరు నిర్మల అంటే నేను వేరు కాదు, నేను కూడా నిర్మలమే అంటుంది ఆమె మనస్సు. "అమ్మ" పాత్రలను పోషించడంలో వైవిధ్యాన్ని చూపెట్టి, భిన్న రుచుల మనుషుల అభిమానాన్ని చూరగొంది శ్రీమతి జి నిర్మల. తప్పు, తంటాలు లేకుండా ఎంత సునాయాసంగా నటించగలదో, తడబాటు, తొట్రుపాటు లేకుండా మనసులోని మాటను నిర్భయంగా చెప్పగలదు నిర్మలమ్మ. ఇటీవల "వయసు పిలిచింది" తమిళ చిత్రంలో శ్రీమతి నిర్మల నటించడం జరిగింది ఆ చిత్రాన్ని చూచిన ఓ తమిళ నిర్మాత, దర్శకుడు తమ చిత్రంలో నటించమని నిర్మలగార్ని అడిగారట.



వారి కోరికను అంగీకరించలేదు నిర్మలమ్మ అందుకు బలీయమైన కారణం వుంది "ఏ భాషలోనైనా ఒక నటిగానీ, నటుడుగానీ ఒక పాత్రను పోషిస్తున్నపుడు, ఆ పాత్ర స్వభావ, స్వరూపాల్ని అర్థం చేసుకుని నటించడం అవసరం, శ్రేయస్కరం తమిళ భాషలో డైలాగులు చెప్పడం నాలాంటి తెలుగు ఆర్టిస్టుకు కష్టమన్పించింది నాకు ఆ భాషా దర్శకుల అంచనామేరకు, అంత స్పీడుగా, సంతృప్తికరంగా నేను నటించలేకపోవచ్చు, డైలాగులు చెప్పలేకపోవచ్చు, దానివల్ల వారికి కొన్ని నష్టాలు కల్గినా కలగొచ్చు ఈ విషయాలన్నింటినీ ఆ నిర్మాత, దర్శకులకు వివరించాను సర్దుకుందామని వారన్నా, నేను సమ్మతించలేదు. ఇది సమంజసం కాదంటారా" అనడిగింది నిర్మల

ఎందరో దొరికితే చాలు గద్దలా తన్నుకు పోదామని ఎదురు చూస్తుండగా, ఎదురు చూడకుండా వచ్చిన అవకాశాన్ని ఎవరొదులుకుంటారీ కాలంలో? ఆత్మవంచన చేసుకోవడం ఇష్టంలేదు గనుకనే "వద్దు" అని చెప్పగలిగింది శ్రీమతి నిర్మల నిజం చెప్పాల్సివస్తే డబ్బు తీసుకోకుండా ఎక్కువ చిత్రాల్లో ఫ్రీగా నటించిన నటి "నిర్మల" అంటే అందరికీ ఆమోదయోగ్యమే అనుకుంటా.






తమిళంలో... తెలుగులో శ్రీ బాలచందర్ చిత్రాలు. కన్నడంలో శ్రీ రాజకుమార్‌తో రెండు చిత్రాలు. హిందీలో రిషితో ఒక చిత్రం.

జయప్రద నటిస్తున్న చిత్రాలన్నీ స్కోప్ చిత్రాలు గవడం... గమనార్హం

## త్యాగయ్యగా విప్రనారాయణుడు

విప్రనారాయణ పాత్రను శ్రీ అక్కినేనికి, భరణీ పిక్చర్స్ నిర్మాతలు యిచ్చినప్పుడు, ఆ పాత్రకు తాను అద్వితీయుడు అని ఏకగ్రీవామోదాన్ని పొందారు

''త్యాగయ్య'' పాత్రను స్వర్గీయ నాగయ్యగారు అద్భుతంగా పోషించారు గనుక ... ఆ పాత్రను మరొకరు పోషిస్తే అపాత్ర అవుతుంది అని ఎందరెందరో విమర్శలను వదులుతున్నారు.

అలాంటి విమర్శలను వమ్ముచేసే దమ్ము డాక్టర్ అక్కినేనికి కలదని నిరూపించే ప్రయత్నానికి, శ్రీమతి కృష్ణవేణి నడుంకట్టింది

రాబోయే సంవత్సరంలో, శ్రీ అక్కినేని యిచ్చే కాల్‌షీట్లను బట్టి ''త్యాగయ్య'' జీవిత కథను స్కోప్‌లో వర్ణచిత్రంగా నిర్మించడానికి, శ్రీమతి కృష్ణవేణి నిర్ణయించింది

[38 వ పేజీ చూడండి]

## జయప్రదకి ప్రజాభిమానం

అడవిరాముడు, యమగోల, యుగపురుషుడు చిత్రాలు జయప్రదకు జనంలో అగ్రశ్రేణి స్థానాన్ని ఆర్జించాయి ముఖ్యంగా విద్యార్థి విద్యార్థినులు, స్త్రీలు జయప్రద పట్ల ప్రత్యేక అభిమానాన్ని చూపెడుతున్నారు హిందీలో హేమ మాలిని అనుభవిస్తున్న స్థానాన్ని .. తెలుగులో జయప్రద వహిస్తున్నది

జయప్రద జయానికి కారణం... ఆమెలో రతీదేవి లక్షణాలను, అవయవ పొందికను, దేవుడు ప్రసాదించడమే

## హిందీ చిత్రాల ఆఫర్లు

''సిరిసిరి మువ్వ'' హిందీ చిత్రంలో జయప్రద లావణ్యాన్ని మెచ్చిన అనేక నిర్మాతలు... ఆమెను తమ చిత్రాలకు పదే పదే కోరుతున్నారు. కానీ, జయప్రదకు యింట గెలవాలన్న ఆశ అత్యధికంగా వుండడంవల్ల . హిందీ చిత్రాల పట్ల ఆసక్తిని చూపడంలేదు

## కాశ్మీరులో యిరవై రోజులు

ఆగస్టు 11 నుంచి ఆగస్టు 31 వరకు, జయప్రద కాశ్మీరులో రెండు చిత్రాల షూటింగుల్లో పాల్గొంది

శ్రీ విశ్వనాథ్ చిత్రీకరణలో హిందీ చిత్రం ''సర్గమ్''లో రిషికపూర్‌తో శృంగార దృశ్యంలో పాల్గొని, శ్రీ సాంబశివరావు చిత్రీకరణలో సత్య చిత్ర వారి ''కుమారరాజా'' లో కృష్ణతో ఆటపాటల్లో పాల్గొని .. సెప్టెంబర్ తొలి రోజున శ్రీ ఎన్టీఆర్‌తో పద్మావతిగా నటించే జయప్రద, ఆగస్టులో వారం రోజులు శ్రీ ఎమ్ ఎస్ రెడ్డి ''రామబాణం''లో శోభన్‌బాబుతో ముఖ్య సన్నివేశాల చిత్రీకరణలో పాల్గొనడం జరిగింది

జూలైలో కమలహాసన్‌తో, జయప్రద పాల్గొన్న సన్నివేశాలను శ్రీ బాలచందర్ సింగపూర్‌లో చిత్రీకరించారు.

## జయప్రద నటిస్తున్న చిత్రాలు

ఇప్పుడామె నటిస్తున్న తెలుగు చిత్రాలు మారుతీ ప్రొడక్షన్స్, సత్య చిత్ర రెండు చిత్రాలు, కౌముదీ పిక్చర్స్ రెండు చిత్రాలు, అన్నపూర్ణ కళానికేతన్, శ్రీకాంత్ ప్రొడక్షన్స్, త్రిమూర్తి ప్రొడక్షన్స్, శ్రీ రామకృష్ణ సినీ స్టూడియోస్



# హైద్రాబాద్ సినిమా

## శ్రీ రాఘవేంద్ర మహిమ

మంత్రాలయ రాఘవేంద్రస్వామి భక్తుల సంఖ్య తెలుగు దేశంలో ఈమధ్యనే హెచ్చునారంభించింది ఆరీత్యానే అవవచ్చు – 'శ్రీ రాఘవేంద్ర విజయ' అని కొంతకాలం క్రితం వచ్చిన కన్నడ చిత్రం ఇప్పుడు తెలుగులో రాబోతున్నది

హైదరాబాద్ ఫిలిం ఛేంబర్ కార్యదర్శి శిరా సత్యనారాయణ కుమారుడు మోహన్‌కుమార్ గురుదత్ ఫిలింస్ పేరిట తెలుగులో తీస్తున్న ఈ చిత్రానికి 'శ్రీ రాఘవేంద్ర మహిమ' లేక మంత్రాలయ మహాత్మ్యం' అని పేరు పెట్టారు. మాటలు, పాటలు – ఎ. వేణుగోపాల్ సంగీతం– రంగారావు సమకూర్చుతున్నారు ప్రధాన పాత్రధారులు రాజకుమార్, ఉదయకుమార్, జయంతి, ఆదోని లక్ష్మి

## నగ్న సత్యం

'విశ్వశాంతి' వాది విశ్వేశ్వరరావు దీప్తి ఇంటర్నేషనల్ బానర్‌తో సమకాలిక సమాజంలో తన కనుల బడిన 'నగ్న సత్యం' తెరపై చూపబోతున్నారు ఆగస్టు 17 న ఈ సంగతిని పత్రికలవారి చెవిని వేశారు

ఏప్రిల్ ప్రారంభంలో హైదరాబాదును అతలాకుతలం చేసిన విపరీత సంఘటనతో 'వెలుగు'లోకి వచ్చిన రమీజాబీని ఈ చిత్రంలో ఒక ముఖ్య పాత్రకు ఎంచుకోగలిచారట. అంతలో ఆమె అరెస్టు అందుకు అవరోధం అయిందట అందువల్ల ఆ పాత్రకు ఇంకెవరినైనా ఎంచుకుని అయినా శీఘ్రమే నిర్మాణం ప్రారంభించనున్నట్లు తెలిపారు (రమీజాబీని అరెస్టు చేయించటానికే



'రావణుడే రాముడైతే'లో జయచిత్ర, లత [ఫొటో : శ్రీధర్]

తాము ఆమెను నందికొట్కూరు నుంచి హైదరాబాదు పిలిపించినట్లు వచ్చిన పుకార్లు, ఆరోపణలను ఈ సందర్భంలో ఆయన ఖండించారు )

'నగ్న సత్యం' కథ, చిత్ర కథ, కొన్ని పాటలు తమవేననీ, దర్శకత్వం తామే వహిస్తారనీ ఆయన అన్నారు మాటలు, కొన్ని పాటలు – శ్రీరంగం శ్రీనివాసరావు, సంగీతం – చక్రవర్తి సమకూర్చుతున్నారు కామెరా – మోహనకృష్ణ, కళ – కె వి. ఎల్ దత్తు, నటీనటవర్గం ఇంచుమించు అంతా కొత్తవారే తీర్పు, మార్పు, తర్వాత తీయదలిచిన 'ఓర్పు'తో పాటు 'కంచుకాగడా', 'కీర్తి, కాంత, కనకం', 'దేవుడు కట్టిన దేవాలయం', అనే చిత్రాలు తీయటానికి కూడా కాగితపు పని పూర్తిచేసి పెట్టుకున్నామనీ, వాటి వాటికి కావలసిన నటీనటుల అందుబాటునుబట్టి నిర్మాణం సాగుతుందనీ విశ్వేశ్వరరావు ఈ విలేఖరితో అన్నారు

'కంచు కాగడా' ఎన్ టి రామారావుతో తీసే భారీ చిత్రమనీ, అది వచ్చే సంవత్సరం ఆరంభంలో ప్రారంభించేలోగా తామిరువురూ (వారి అబ్బాయికి వీరి అమ్మాయిని ఇవ్వటంద్వారా) వియ్యంకులుకూడా కాగలరనీ ఆయనచెప్పారు

## తాయారమ్మ - బంగారయ్య

యువ దర్శకుడు కొమ్మినేని శేషగిరిరావు ఖచ్చితంగా షెడ్యూలు ప్రకారం పని సాగిస్తారు పూర్ణోదయా ఆర్ట్ క్రియేషన్స్ 'తాయారమ్మ - బంగారయ్య' చిత్రం షూటింగు షెడ్యూళ్లే ఇందుకు నిదర్శనం జూన్ 1 నుంచి 11 వరకూ నెల్లూరుజిల్లా పొట్టెంపాడు, నరసింహకొండ, బుచ్చిరెడ్డిపాలెం, జులై 24 నుంచి 31 వరకూ ఇక్కడి భాగ్యనగర్ స్టూడియో, ఆగస్టు 4 నుంచి 10 వరకూ మద్రాసులో, 15 నుంచి 23 వరకు మళ్లీ ఇక్కడ అని నిర్ణయించుకుని ఆ ప్రకారం షూటింగు జరిపారు

ఏడిద నాగేశ్వరరావు, ఆకాశం శ్రీరాములు నిర్మిస్తున్న ఈ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే దర్శకత్వం – కొమ్మినేని, కామెరా – భాస్కర్, మాటలు – జంధ్యాల, పాటలు – ఆత్రేయ, వేటూరి, సంగీతం – చక్రవర్తి, ఎడిటింగ్ – అంకిరెడ్డి, నిర్వహణ – పృథ్వీరాజ్

నటీనటులు – జానకి, ఛాయాదేవి, సంగీత, మాధవి, జయ, సత్యనారాయణ, రంగనాథ్, చంద్రమోహన్, రామలింగయ్య, రాజబాబు, శరత్‌బాబు, మాడా, కె కె శర్మ వగైరా

ఎం. ఎస్. శర్మ





సారీ! తొందరపడ్డాను!

ఏది పాపం ?
ఏది పుణ్యం ?

## దాసరి యింట్లో బుర్రా

ఒకరోజు ఉదయాన ఆరున్నర ప్రాంతాన ఈ ''జనప్రియుడు'', జనప్రియ దర్శకుడుకోసం వెళ్లడం జరిగింది

అప్పటికే నూరుఏంది కళాకారులు శ్రీ దాసరి కోసం, ఆయన చెప్పే జవాబుకోసం వున్నారు ఎరిగ్గా . ఆరునలభైకి ఆయన వచ్చారు

తనకోసం వచ్చిన అందరినీ పలకరించి .. తప్పక యిస్తానని తరువాతి చిత్రంలో కల్పిస్తానని చెప్పడాన్ని యీ కలం నోట్ చేసింది

మదరాసులో ఎప్పుడూ కనిపించని ఓ వ్యక్తి శ్రీ దాసరి యింట అగుపించారు

ఆయనలో ఏదో ఆకర్షణ దివ్య శక్తి యీ కలాన్ని ఆకట్టుకుంది ఎవరండీ, వీరు అని ప్రజాదర్శకుడిని అడిగాను

''వీరి పేరు బుర్రా సుబ్రమణ్యశాస్త్రిగారు ''వేమన'' గూర్చి చర్చకోసం పిలిపించాను,'' అన్నారు శ్రీ నారాయణరావు

## వేమన పాత్ర పోషణలో అక్కినేని దర్శకుడుగా దాసరి

లక్ష్మి ఫిలింస్ కంబైన్స్ (ఎన్ ఆర్ అనురాధ దేవి) శ్రీ అక్కినేనిని వేమనగా చిత్రీకరించే బాధ్యతను, అగ్రదర్శకుడు శ్రీ దాసరికి అప్పగించారు

''వేమన'' పాత్రలో ఎంతో వైశిష్ట్యం వున్నదని, జనం మెచ్చే అంశాలు ఆయన జీవన శైలిలో వున్నాయని, శ్రీ నారాయణరావు తెలిపారు

''వేమన''ను డ్రై సబ్జెక్టు విని అనేకులు సంశయిస్తున్నారని, ''విప్రనారాయణ, కాళిదాసు, జయదేవ'' పాత్రలకన్నా పుషారుగా సాగే కథాగమనం

## సినిమా

[ 36వ పేజీ తరువాయి]

వున్నదని, నిర్మాతగా శ్రీమతి అనురాధాదేవి తన అభిప్రాయాన్ని వెల్లడించారు

శ్రీ దాసరి . శ్రీ అక్కినేని కలిసి పని చేసే మరో మాణిక్యమే ''వేమన'' చిత్రం

### *శ్రీ బాలసుబ్రహ్మణ్యేశ్వర ఫిలింస్*

విజయవాడకు చెందిన మరొక ప్రముఖ వ్యక్తి శ్రీ బందా సూర్యనారాయణ తెలుగు కళనచిత్రరంగాన్ని ప్రవేశించారు తన సంస్థకు శ్రీ బాలసుబ్రహ్మణ్యేశ్వరఫిలింస్ అని పేరు పెట్టారు

శ్రీ సింగీతం శ్రీనివాసరావు దర్శకత్వంలో కమలహాసన్ రెండు పాత్రలను పోషిస్తున్న రంగుల చిత్రం ప్రసాద్ స్టూడియోస్‌లో ప్రారంభమై . పదిరోజులు జరిగింది

కొత్తతరహా కథావిధానం గలిగిన ఎస్ బి ఎస్ ఫిలింస్ వారి వర్ణ చిత్రంలో జయసుధ రోజారమణి కథకు నాయికలుగా నటిస్తున్నారు ఈ చిత్రంలోని తతిమ్మా పాత్రలను కాంతారావు, ప్రభాకరరెడ్డి, సారథి, పండరీబాయి, రమాప్రభ పోషిస్తున్నారు

ఈ వర్ణ చిత్రానికి జంధ్యాల రచనను, రాజన్ నాగేంద్ర సంగీతాన్ని, బాలుమహేందర్ ఛాయాగ్రహణాన్ని, టి ఎస్ సంతానం ప్రొడక్షన్ను, కె వి కృష్ణయ్య సహకార దర్శకత్వాన్ని నిర్వహిస్తున్నారు లక్ష్మి ఫిలింస్ పంపిణీదారులు

## "మహాభారతం" మొదలైంది !

ఏమిటీ! క్రొత్త టైటిల్ అని ఆశ్చర్య పోకండి విషయం చెబుతాను వినుకోండి శ్రీ సత్యం ఎంటర్‌ప్రైజస్ వారి ''కలియుగ మహాభారతం'' సినిమా స్కోప్ వర్ణ చిత్రం షూటింగ్ ఆగస్టు 21వ తేదీ వుదయం 9–45 గం లకు ప్రసాద్ స్టుడియోలో ప్రారంభమైంది విక్టరీ మధుసూదనరావుగారు క్లాప్, ప్రముఖ నిర్మాత శ్రీ చటర్జీ స్విచ్ ఆన్ చేయగా, మొదటి దృశ్యాన్ని ''చలిచీమలు'' ఫేం నూతన్‌ప్రసాద్‌తో చిత్రీకరించారు దర్శకులు శ్రీ హనుమాన్‌ప్రసాద్ మొదటి షెడ్యూల్ సెప్టెంబర్ 5 వరకు జరుగుతుందని, అందరార్టిస్టులు ఈ షెడ్యూల్లో పాల్గొంటారని నిర్మాత శ్రీ సత్యనారాయణ చెప్పారు

శ్రీ పరుచూరి కథ, మాటలు వ్రాసిన ఈ ''కలియుగ మహాభారతం'' వర్ణ చిత్రంలో సాంఘిక కృష్ణుడిగా చలం, సోషల్ కర్ణుడిగా సత్యేంద్రకుమార్ నటిస్తున్నారు శకునిగా పి యల్ నారాయణ, ధృతరాష్ట్రుడిగా వంకాయల సత్యనారాయణ, దుర్యోధనుడిగా నూతన్‌ప్రసాద్ నటిస్తున్న ఈ స్కోప్ చిత్రంలో నర్సింహరాజు, రంగారావు, హరిబాబు, మాధవి, కె విజయ తదితర ముఖ్య తారాగణం

వెరైటీ చిత్రాలను తీయాలనే అర్జ్ వున్న నిర్మాత శ్రీ జి సత్యనారాయణ నిర్మిస్తున్న ఈ విమర్శనాత్మక, ప్రయోగాత్మక చిత్రానికి సత్యం (సంగీతం), లక్ష్మణగోరే (కెమెరా), వేటూరి (పాటలు), భాస్కరరాజు (కళ), రంగస్వామి (అసోసియేట్ ఇన్ డైరెక్షన్) సాంకేతిక సారధులు

క్రొత్తదనం చూపించాలనే కుతూహలం, బుద్ధిబలం వున్న శ్రీ హనుమాన్‌ప్రసాద్ మహాభారతానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వం సమకూరుస్తున్నారు

– జనప్రియ ★



సారీ ! తాయమ్మగారూ !

"అంగడి బొమ్మ"

# మోహన రూప

[26వ పేజీ తరువాయి]

''ఇవ్వన్నీ డేట్ ఎక్స్పైర్ అయిన మందులు పారెయ్యమని తీసివేశాం కదూ నర్స్ '' రూపాదేవి తీక్షణంగా అడిగింది ఆ మందులు చూచిన ఆమె ముఖం అభ్రమగేలా ఉంది

''ఆఁ అవును ఊర్కే అక్కడ పెట్టారు'' కళ్ళు నమిలింది నర్స్ నవ్వుకున్నాడు ఇంద్ర

''మై గాడ్! నిన్న ప్రిస్క్రిప్షన్ వ్రాసి ప్యాజన్, మైక్రోస్పైరిన్ లేదు తెప్పించుకో మన్నాను వీళ్ళు ఇక్కడినుండి అందజేశారా! చాలా బావుంది.'' ఆమె క్రింది పెదవు నొక్కిపట్టి ఆలోచనలో పడింది

''సారీ మేడమ్ నాకేం తెలియదు '' నర్స్ అంటుండగానే కోపమంతా బూట్లమీద చూపుతూ వచ్చాడు దామోదర్

''యెవరి అనుమతితో ఈ గది తాళం తీశారు? నేను సూచెయ్యగలను '' చిందులు వేశాడు అతను

''మేం అదే ప్రశ్న అడగాలనుకుంటున్నాము దామోదర్‌గారూ! యెవరి అనుమతితో మీరు పాత మందులిచ్చి పేషెంట్ల ప్రాణాలు తీయాలను కున్నారు?'' ఇంద్రమోహన్ ప్రశ్న పదునుగా వచ్చింది

''నేను నేనిక్కడ మేనేజర్ని యెవరి అనుమతి అక్కరలేదు'' అన్నాడు దుడుకుగా

''దాని యజమానుల అనుమతి కూడా అక్కరలేదా ?''

''ఇవన్నీ అడగటానికి నువ్వెవరు ?'' దామోదర్‌కు మండిపోతుంది అతనికంటే యెక్కువగా నర్స్ పరిస్థితి ఉంది అందుకే ఇంద్రమోహన్ పరిచయం చెబితే యెంత దురుసుగా మాట్లాడాలో దామోదర్ మాట్లాడుతాడు అఘమానంతో అతను వెనక్కు వెడతాడు

ఒంటరిదయిన రూపాదేవిని యెంత ఏడ్పించాలో అంతా ఏడ్పించవచ్చునని ఆమె భావించింది త్వరగా తనేదో ఘనకార్యం చేసినట్టు ముఖం పెట్టి పరిచయం చేయించింది

''ఇతను ఇంద్రమోహన్‌గారని మీ స్థలంలో పని చేసేవారు '' అన్నది త్వరగా

''ఒహో! అదా సంగతి, దొంగతనాలు చేసేవారికి అందరిపై అనుమానము కలుగడంలో అసహజమేమిలేదు'' అన్నాడు, దురుసుతనం, వెటకారం మిళాయించి

''షటప్! దామోదర్, ఈ మందులు ఇక్కడ యెవరు పెట్టమన్నారు ?'' రూపాదేవి కోపంగా అడిగింది

''ఒహో! దొంగను వెనుక వేసుకుని వచ్చి నన్ను మాటలంటున్నారా! ఇది చాలా బాగుంది.''

''దామోదర్! బంధువువని నీ ఆగడాలన్నీ సహించాను మితిమీరిపోతున్నావ్ యెవరు దొంగో, యెవరు దొరో నాకు బాగా తెలుసు నువ్వు డేట్ ఎక్స్పయిరీ అయిన మందులు అమ్మాలనుకున్నదానికి సంజాయిషీ ఏమిటి ?''

''అమ్మానని ఈ నర్స్ చెప్పిందా! చూడు నిన్ను ఏం చేస్తానో '' దామోదర్ దెబ్బతిన్న పులిలా ముందుకు దూకాడు

ఇంద్రమోహన్ ఆపాడు, అతని చేయి పట్టి

''అరఘడియ స్నేహాలు ఇలాగే ఉంటాయి భాయిసాబ్, శాంతించు అక్కడ పేషెంటుకు ఏదయినా జరిగితే మనకు శ్రీకృష్ణ జన్మస్థానమే ప్రాప్తి'' అన్నాడు నింపాదిగా

''మందులు ప్రమాదం కలుగజేస్తాయా? లోగడ యెన్నో ఇచ్చాం.'' నోరు జారాడు దామోదర్

''అన్నిసార్లు మంచి జరుగాలని ఏముంది! డాక్టర్లకు తెలియకనా అంత ఖరీదయిన మందులు పారవేసేది ?''

''ఇప్పుడేం చేద్దాం ?'' దిగులుగా చూచాడు దామోదర్

ఇంద్ర నవ్వుకున్నాడు పులుల్లా ఎగిరే మనుషులంతా అవకాశం వస్తే అరనిమిషంలో పిల్లుల్లా మారిపోతారు దామోదర్ అలాగే దిక్కులు చూడటం మొదలుపెట్టాడు

''మొదట వెళ్లి ఆ పేషెంటు సంగతి చూద్దాం తరువాత ఏం చేయాలన్నది ఆలోచించాలి'' అన్నాడు ఇంద్ర

''మీరు ఏదయినా పనిమీద వచ్చారా ?'' అప్పటికి తేరుకుని అడిగింది రూపాదేవి

''కాలుకు చిన్న దెబ్బ తగిలితేనూ '' అన్నాడు ప్యాంటు కాస్త యెత్తి చూపుతూ

''పూర్తిగా చెక్కుకుపోతే కాస్త దెబ్బ అంటారు '' ఆదుర్దాగా అతని పాదానికి కట్టు కట్టిందామె దూది అయోడిన్‌లో అద్ది కాలు మీద వేసింది

''ఒక్క క్షణం భగ్గుమన్నట్టు అనిపిస్తుంది మరుక్షణం హాయిగా ఫీలవుతారు '' అన్నది అతను మంట అనుభవించే స్థితిలో లేడు అందమైన ఆమె పాలభాగం కేసి చూచాడు

''మీ స్పర్శలో విద్యుత్ ప్రవాహముంది'' అనుకున్నాడు మనసులో ఆమె కట్టు కట్టింది

''మీరూ రాకూడదూ ?'' అన్నది దిగులుగా

''తప్పకుండా ఇంటికి వెళ్లి చేసేది ఏముంది ?'' అన్నాడు వచ్చి కార్లో కూర్చుంటూ




దామోదర్ ముఖం గంటు పెట్టుకున్నాడు వెనుక సీట్లో ఇబ్బందిగా కదిలాడు

"మీ అమ్మా, నాన్నకు చెప్పి వెడదామా ?"

"అమ్మా నాన్న పూర్ణను తీసుకుని, వియ్యాలవారింటికి వెళ్లారు ఆ అయిదువేలు అందగానే యెక్కడలేని ప్రేమలు పుట్టుకొచ్చాయి, వారంరోజు లుండమన్నారట ఉండిపోయారు" అన్నాడు హాస్యంగా

కారు ముందుకు సాగింది

*25*

బ్యాగు పట్టుకుని వచ్చే రూపాదేవిని చూచి తన సీట్లోకి పోబోయిన ఇంద్రమోహన్ ఒక్క క్షణం ఆగాడు 'నాకోసం రాలేదుకదా ' అనుకుని మరుక్షణమే 'తన అమాయకతకు నవ్వుకున్నదు బ్యాంకుకు డబ్బుకోసం రాకూడదని యెక్కడున్నది

"యెలా ఉంది మీ కాలు ?"

"మీ దయవల్ల తగ్గిపోయిండి" లన్నాడు ఆమె చిరునవ్వు శరత్కాల చంద్రకాంతిలా ఉంది

"మధ్యాహ్నం ఒకసారి రాకూడదూ ?" అర్థింపుగా చూచింది

"మీరు ఆజ్ఞాపించాక రాకుండా యెలా ఉండగలను !" అనుకున్నాడు వస్తానని ఆమెను పంపాడు అందరి చూపులూ తమవైపే ఉండటం గమనించి చక, చక బయటికి వెళ్లిపోయిందామె

"మీ బంధువులా ?" ప్రక్కనున్న క్యాషియర్ అడిగాడు

"స్నేహితులు " అన్నాడు అతని కళ్లలో ఈర్ష్య స్పష్టంగా కనిపించింది అందమైన అమ్మాయి మాట్లాడితే గౌరవము కాదూ !

"ప్రేమలాంటి వ్యవహారం ఏమయినా ఉందా ?"

"ఊహూం. ." అన్నాడు విరసంగా

"బి, కేర్ ఫుల్ భాయ్ ! డాక్టరమ్మ కదా, నవ్వుతుందని భ్రమపడేవు పేషెంట్లను మెస్మరైజ్ చేయటం వాళ్ల వృత్తి..." అతను ఊరుకునేలా లేదు

"అలాగా డాక్టర్లతో మీకు చాలా అనుభవం ఉన్నట్టు ఉందే" అన్నాడు అమాయకంగా

"ఆః వాళ్ల హొయలు చూచి బోల్తా పడ్డాను ఆఫ్టరాల్ బి కామ్ గాడివి, అన్నది' ఆముదం త్రాగినట్టు ముఖం పెట్టాడు

ఉప్పెనలా వచ్చిన ఉత్సాహం తగ్గిపోయి ఆలోచనలో పడ్డాడు అతను మధ్యాహ్నము లక్ష్మి క్లినిక్ వైపు నడుస్తున్నా ఎన్నో ఆలోచనలు చుట్టుముట్టాయి చిన్నగా నవ్వుకుని ఓ నిర్ణయానికి వచ్చాడు తనంతట తాను బయట పడడు ఆమె ముందుగా హృదయం విప్పి చెబితే అంగీకరిస్తాడు అవును, అంతే

"రండి రండి భోజనము చేస్తూ మాట్లాడుకుందాం" అన్నది అప్పటికే హాచ్ మెన్ అన్నీ బల్లమీద సర్ది పెట్టాడు క్యారియర్ విప్పాడు

"క్యారియర్ తెప్పించుకుంటున్నారేం ?"

"నాన్న యెక్కువ హైద్రాబాద్ లో ఉంటున్నారు దామోదర్ తన బండారం బయట పడిందని చెప్పకుండా చెక్కేశాడు ఇక్కడ పనులు చూచుకోవటం మహాయాతనగా ఉంది" అన్నది టవల్ తో చేతులు తుడుచుకుంటూ

అతను చేతులు కడుక్కుని వచ్చాడు ఇద్దరూ కూర్చున్నారు

"మీరు బాగా చిక్కిపోయారు" అన్నాడు వడ్డిస్తూ

"ఇంకా నయం మనిషినే మాయం అవుతానేమోనన్న భయం పట్టుకుంది ఒకొక్కసారి విచిత్రమయిన ఆలోచనలు వస్తాయి మనిషికి ఏం కావాలి ? అన్నం, బట్ట, తోడు, నీడ అనిపిస్తుంది ముద్ద అన్నం కోసం యింత యజ్ఞం చేయాలా ? నా కున్నది సరిపోదా అనిపిస్తుంది అన్నీ కట్టిపెట్టి హాయిగా అందరు ఆడపిల్లలా జీవించా లనిపిస్తుంది" అన్నది ఉత్సాహం కలుగుతూ

"మనిషి ఆశాజీవి గారూ !"

## పని వేళలు

మోహన

"మళ్లీ గారెలు, వడలు యెందుకు ?"

"క్యారియర్ లో లేవుగా అందుకు ?" నవ్వాడు "ఇది చాలు అనుకుంటే జీవవాహినికి అడ్డు పడినట్టే, ఆశతో ముందుకు సాగాలి సాధించాలన్న నిశ్చలతకన్నా, సాధించా లన్నతపనే ప్రబలమైనదని నేను అనుకుంటాను ఒక్కటే చూచుకోవాలి ఆశ దురాశ కాకూడదు" అన్నాడు

కబుర్లతోపాటు భోజనము కూడా ముగించారు ఇద్దరూ విశ్రాంతి గదిలో కూర్చున్నారు

"మీరు అన్నీ మరిచిపోయి ఈ మిగతా పని పూర్తి చేయించాలి ఇంద్రగారూ" అన్నది

"మళ్లీ మరిచిపోయిన గారెలు గుర్తుకు తెప్పిస్తున్నారేం ?" ఎగతాళిగా అన్నా

"జరిగింది తలుచుకుంటే నాకే సిగ్గుగా ఉంది శాపాల, పాపాల పట్ల నమ్మకం లేకపోయినా ఒక్కటి నిజమండీ మనను అనవసరంగా యెవరినయినా నిందిస్తే, మళ్లీ యెప్పుడో అప్పుడు మనమీద దెబ్బతీస్తాయి మిమ్మల్ని దొంగ అన్నందుకు బాధపడుతున్నారు నన్నో కులటగా ప్రచారం చేశారు ఒకసారి ఒంటరిగా వుండటం చూచి ప్రేమ ఒలకబోశాడు దామోదర్ ఒకసారి చెడిన స్త్రీ పదిసార్లు చెడినా తప్పులేదన్నట్టు మాట్లాడాడు "

"రాస్కెల్ " పళ్లు కొరికాడు

"మనము ముందుకు వెడుతున్నామా వెనక్కు వెడుతున్నామా అర్థం కావటం లేదు మీ స్నేహితుడినే తీసుకుందాం..."

"అదంతా గుర్తు చేయకండి ప్లీజ్ ! నేను కూడా స్వార్థంతో సంకుచితంగా ప్రవర్తించాను ఏం చేయాల చెప్పండి ! నా డిగ్రీ రాకతో తమ కష్టాలు పోతాయని ఆశగా ఎదురుచూచే తల్లి తండ్రులు, నా డిగ్రీతో తమ కోర్కెలు తీరుతాయని ఆశగా ఎదురుచూచే తోబుట్టువులు




## మారితే ...

అప్పుడు అయిష్టమయినా ఆ పనికి అంగీకరించక తప్పలేదు ''

''తెలిసి చేసినా, తెలియక చేసినా తప్పు, తప్పే దానికి శిక్ష అనుభవించాలి '' అన్నది

**రూప** నవ్వు బిగబట్టి సీరియస్. దానికి అతను అన్నాడు.

''ఏ శిక్ష విధించినా నేను సిద్ధమే నేను ఎప్పటికి ఈ అపార్థం తొలగిపోదా, ఆ డైరీ పూర్తిగా చదివే అవకాశమే రాదా అని యెంత అల్లాడిపోయినో. ''

''శిక్ష అడిగారుకదా ! రూపాదేవి కోర్కె నంబర్ సో అండ్ సో ప్రకారం ఈ లక్ష్మీ క్లినిక్, నర్సింగ్‌హోమ్ నిర్మాణం, ఉగాది నాటికి పూర్తి చేయాలని తీర్మానించారు'' అన్నది

''ఓహ్ ! ఇంతేనా, నేను యింకేమో అనుకున్నాను'' అన్నాడు తేలికగా

''మొదలుపెట్టినందుకు పూర్తి చేస్తాను ఆడవారు ఆరంభశూరులు కారని నిరూపించుకోవాలి ''

''చూడండి ఈరోజు నుండి పని ఎని ప్రారంభిస్తాను'' అన్నాడు లేచి వెళ్లటానికి ఉద్యుక్తుడవుతూ

''థాంక్స్ '' అతన్ని సాగనంపుతూ బయటి వరకు వచ్చింది అంతవరకు మబ్బు కప్పకున్న ఆకాశం, మబ్బులు తొలగి నిర్మలంగా అయింది ఆ ఆకాశం తన మనసులా వుంది అనుకుంది పనివారు, స్నేహితులు ఎందరో దొరుకుతారుకాని, నిజంగా పని చేసేవారు, స్నేహం చేసేవారు అరుదుగా దొరుకుతారు ఎంత పెద్ద గండం గడిచిపోయింది ! దురదృష్టవశాత్తు ఆ పేషెంటు చనిపోతే తన వృత్తికే భంగం వాటిల్లేది కోర్టులు గొడవలు, ఎన్ని వుండేది ఆ క్షణంలో ఇంద్రమోహన్ గనక రాకుంటే తన పరువు బజార్న పడేది అతని స్నేహితుని తమ్ముడు అతడిని హైద్రాబాద్‌లో గౌరవించే తీరు చూస్తుంటే కళ్లు చెమర్చాయి కొందరు అందరూ ఉండి కూడా తమ స్వార్థంలో ఒంటరివారవుతారు మరికొందరు ఎవరూ లేకపోయినా తమ గుణ,

గణాలతో అందరికి ఆత్మీయులవుతారు. ఆ కోవకు చెందినవాడే ఇంద్రమోహన్ అనుకుంది.

సాయంత్రం అతను వచ్చి పని చేయించి, సైకిల్ పై వెడుతుంటే ఆమెకు ఏదో స్ఫురించింది అప్పుడే శ్రీహరి ట్రంక్‌కాల్ వచ్చింది.

"ఇంకా రెండురోజులు ఆలస్యం అవుతుంది

# మోహనరూప

రూపా మనము ఓ ఆదర్శంతో అనుకున్న సంబంధం అలా అయింది. ఫారిన్ రిటన్డ్ కుర్రాడున్నాడు. ఎమ్. ఇ. అయిందట... అతనుంటాడా లేదా కనుక్కుని మాట్లాడతాను. ప్రసాద్‌కు కుదిరిపోయింది."

"అదంతా మీ యిష్టం నాన్నా! ఒక పని చేయండి. మీరు వచ్చేటప్పుడు ఓ స్కూటరో, మోటార్‌బైకో తీసుకురండి నాన్నా."

"రూపా! నీ ఆరోగ్యం బావుందా! అసలు నేను చెప్పేదానికి, నువ్వు అడిగేదానికి అసలు పొత్తు వుందా?"

[ఇంకా వుంది]



# ఛాంపియన్ డిటర్జెంట్ కేక్ !

1అప్




## మురికిపై విజయం!

అధికశక్తిగల వన్-అప్, మురికిని నామరూపాలు లేకుండా తుదముట్టించి, మురిపించే మెరిపించే శుభ్రత నిస్తుంది!



వన్-అప్ లోని అధిక శక్తివంతమైన పదార్థాలు, లోపలికి చొచ్చుకుపోగల, తీవ్రంగా పనిచేసే నురగనూ, అధికంగా తెలుపుచేసేవాటినీ సమకూరుస్తాయి. అందుకే వన్-అప్, లోపలదాగిన మురికిని అంతా తీసేసి, బట్టలని శుభ్రపరుస్తుంది—దాంతో తెల్లవాటికి మరింత తెలుపు రంగువాటికి మరింత మెరుపూ వస్తుంది.

## బట్టలకు సంరక్షణ!

అతిమెత్తని వన్-అప్ మీ బట్టలను పూర్తిగా సంరక్షించి, వాటికి సుగంధాన్నిచ్చే ఓ తాజాదనాన్ని తెస్తుంది!



వన్-అప్, శక్తివంతమైనదైనా ఎంతో మృదువుగా పని చేస్తుంది. ఎందుకంటే దీనిలో హానికరమైన పదార్థాలేమీ లేవు గనక. చక్కని సుగంధం చిందించే వన్-అప్, మీ బట్టలపై మృదుత్వంతో పనిచేస్తుంది. దాంతో అవి సుగంధం తాజాదనంతో రూపొందుతాయి.

## డబ్బు ఆదాతో ఉపకారం!

వన్-అప్‌లోని మన్నగల శక్తి, మరీ మరీ, ఉతికిన ప్రతిసారీ డబ్బును ఆదా చేస్తూనే ఉంటుంది!



వన్-అప్, మరే యితర డిటర్జెంట్ కేక్ కన్నా ఎక్కువ కాలం మన్నుతుంది. ఎందుకంటే, వాడగానే దబ్బున అరిగిపోదు గనక అంటే వాడే ప్రతిసారీ డబ్బును ఆదా చేస్తున్నారన్నమాటే!




1అప్

శుభ్రతా, సువాసనా, మెరుపూ సమకూర్చే ఛాంపియన్!

ASP/WL-1 UP IA

విటకో లిమిటెడ్, కాలోల్ 389 330, గుజరాత్.

# వా ర ఫ లం

**15-9-1978 శుక్రవారం మొదలు**
**21-9-1978 గురువారం వరకు**

**మేషం** :- మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వారంమధ్యలో మీ శాలూకు వస్తువులు పోవచ్చును. వృత్తిలో ఎవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం అఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**వృషభం** :—అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. రావలసిన డబ్బు అందుతుంది. వారం అఖరులో చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. స్త్రీలకు—పుణ్యకార్యాలు చేస్తారు. వ్యతిరేకమైన సమాచారం అందగలదు.

**మిధునం** :- ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. సాహసిక వ్యవహారాలు లాభించగలవు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్యకళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

**కర్కాటకం** :—ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ఆందోళన కలుగుతుంది. వారం మధ్యలో అనుకూలమైన వార్తలను వింటారు. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం** :—మీ ఆలోచనలు ఫలిస్తాయి. సాటివారిలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం అఖరులో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**కన్య** :—మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. సాటివారితో వాద ప్రతివాదాలు తగవు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి. వారం అఖరులో ప్రయాసకు గురికాగలరు. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోదార్థం కొంత వ్యయం జరుగుతుంది.

**తుల** :—వృత్తిలో ఆదాయం బాగుంటుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ పెరుగుతుంది. వ్యాపారంలో సాటివారి పోటీ పెరుగుతుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది దైవకార్యాలు నెరవేరతాయి.

**వృశ్చికం** :—మీ కార్యక్రమాలు అడావుడిగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. నూతన వ్యవహారాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం అఖరులో మీ అంచనాలు తారుమారు కాగలవు. స్త్రీలకు—పుణ్యకార్యాలు చేస్తారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**ధనుస్సు** :—వృత్తిలో సాటివారి పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ముఖ్యంగా లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మకరం** :- భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. ప్రయాణాలు బాగుంటాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. మీ [illegible] కలిగిస్తుంది. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**కుంభం** :—మీ కార్యక్రమాలు బాగుంటాయి. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. మీ కృషికి తగిన ఫలితం లభిస్తుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలు వింటారు.

**మీనం** :—సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో నూతన వ్యవహారాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి. **—మహేష్**



విజయ్

పిల్లలాగానె పైర్లు కూడా ఏపుగా పెరగాలంటే పుష్టికరమైన ఆహారం ఇవ్వాలి. అందుకై నత్రజని, భాస్వరం, పోటాష్‌లను అవసరమైనంతగా పైర్లకు వేయాలి. విజయ్ కాంప్లెక్స్ ఎరువుల్లో ఈ మూడు ముఖ్య పోషక పదార్థాలు సరియైన పాళ్ళలో వున్నాయి.

మీ భూముల, పంటల అవసరాన్ని గుర్తించి తయారు చేసిన కాంప్లెక్స్ ఎరువులే విజయ్ 17-17-17, విజయ్ 14-28-14, విజయ్ 24-24-0.

ఆసియాలో పెద్దది, అధునాతనమైనది అయిన మద్రాస్ ఫర్టిలైజర్స్‌వారి కర్మాగారంలో విజయ్ ఎరువులు మీకై తయారుచేయ బడుతున్నాయి.

విజయ్ ఎరువులనుగురించి ఇంకా వివరాలకు
ఈ క్రింది వారిని సంప్రదించండి.



ఏరియా మేనేజర్
మద్రాస్ ఫర్టిలైజర్స్ లిమిటెడ్
44, శాంతి నగర్ కాలనీ, హైదరాబాదు-500 028

VIJAY
MADRAS FERTILIZERS






# ఫాలాక్షుని షైర

## పొడుగు మోటరుకారు

సౌదీ అరేబియా రాజుగారు తనకు మామూలు కారు చాలటంలేదని కాడిలాక్ కంపెనీకి ప్రత్యేకంగా ఆర్డరిచ్చి 25 అడుగుల పొడువుకల్గి మాంఛి ఎయిర్ కండిషను కారు చెయించు కున్నారట. శభాష్!

## ఖైదీలకి ఆటవిడుపు

స్వీడనులోని ఖైదీలను వో జట్టు కాలిబంతి ఆటగాళ్ళతో కాలిబంతి ఆటపోటీ పెట్టాలని వూరి వారు ఖైదు అధికారులూ అనుకుని, చక్కని ఖైదీలను ఏరి జట్టుగాచేసి, ఆటలోని మర్మాలను, పొడుపులను నేర్పి అనుకున్నరోజుకి ఆటస్థలంలో వొదిలారట. అంతా రెడీ అంటే రెడీ అనుకుని అంపైర్ "రెడీ" అని విజిలు వూదేసరికి ఖైదీ ఆటగాళ్ళలో అయిదుగురు లేరట. వారంతను ముందే శక్తికొద్దీపలాయనం చిత్తగించారట.

## పోలీసు సంచీలో మద్యం సీసాలు !

తమిళనాడులోని మద్రాసులోని ఆవడి అనే చోట రాజ్‌మోహన్ అనేఓ పోలీసు కానిస్టేబుల్ దిగేసిన రాయిలా వో చోటలా నిలబడిపోయాడట. ఏమిటీ వింతని చూస్తే అతని దగ్గరున్న సంచిలో "మధుపానం" సీసాలున్నాయట—వాటి జెండియాల్ డూయింగ్ !

[58వ పేజీ చూడండి]

## ఇంగ్లండు ఔదార్యం

స్వీడనుదేశంలాగానే ఇంగ్లండుదేశం కూడా తాను మనభారతదేశానికిచ్చిన అప్పుగానీ, వడ్డీగానీ తిరిగి తీర్చేయవలేదు అని చెప్ప నిశ్చయించు కున్నదట. అట్లాయిన స్వీడనుదేశంలాగా మన దేశానికి డబ్బు అప్పిచ్చిందొదిలేసిందా ఆహా భారతభూమి ఏమి నీఅదృష్టము. ఇదినీ పేగాని వి దేశీయులకు లేదా !

## కాబరేపేర నగ్న నృత్యాలు

బెంగుళూరులో ఓ నైట్ డ్యాన్సులు నడిపే హోటలులో క్యాబరే డ్యాన్సుపేర గుడ్డలిప్పుకుని గంతులు వేస్తున్న శోభ, కల్పన, మీనా అనే ముగ్గురు నాట్యకత్తెలను పోలీసులు పున్నపళాన్న ఖైదు చేశారట ఆహా...అంటే అలానే అనికాదు. బట్టలు తొడుక్కోనిచ్చి ఖైదుచేసుంటారు.





# ఎనిమిదేళ్ళలో మావద్ద మీసొమ్ము రెట్టింపు పైగా అవుతుంది



బాగా ఆలోచించండి

## మా **గృహలక్ష్మి**

డిపాజిట్ పథకంలో చేరండి.

మెచ్యూరిటీ కాలమందు లభ్యమయ్యే మొత్తం సూచించుపట్టిక

| కాలము నెలలలో | డిపాజిట్ చేసిన మొత్తం 100 | 500 | 1000 | 5000 | 10,000 |
|---|---|---|---|---|---|
| 12 | 106.40 | 532.00 | 1064.00 | 5320.00 | 10640.00 |
| 24 | 113.25 | 566 25 | 1132 50 | 5662.50 | 11325 00 |
| 36 | 120 45 | 602.25 | 1204.50 | 6022 50 | 12045 00 |
| 39 | 128.35 | 641.75 | 1283.50 | 6417.50 | 12835 00 |
| 48 | 135.95 | 679.75 | 1359.50 | 6797 50 | 13595 00 |
| 60 | 146.80 | 734 00 | 1468 00 | 7340 00 | 14680 00 |
| 63 | 161 65 | 808 25 | 1616.50 | 8082 50 | 16165.00 |
| 72 | 173.10 | 865.50 | 1731.00 | 8655.00 | 17310 00 |
| 84 | 189.70 | 948 50 | 1897 00 | 9485 00 | 18970 00 |
| 96 | 207.85 | 1039 25 | 2078 50 | 10392 50 | 20785.00 |
| 108 | 227 75 | 1138 75 | 2277 50 | 11387 50 | 22775 00 |
| 120 | 249 55 | 1247.75 | 2495 50 | 12477 50 | 24955 00 |
| 132 | 273 45 | 1367 25 | 2734.50 | 13672 50 | 27345 00 |
| 144 | 299 65 | 1498.25 | 2996 50 | 14982.50 | 29965.00 |

వందలలో డిపాజిట్లు తీసుకొంటాము



## ది ఆంధ్రప్రదేశ్ స్టేట్ కోపరేటివ్ బ్యాంక్ లిమిటెడ్
(షెడ్యూల్డ్ బ్యాంకు)

మీ సంక్షేమాన్ని కాంక్షించే బ్యాంకు

ట్రూప్ బజార్, హైదరాబాద్ - 500 001, Tel. 44481

ఎస్.కె. మురళీధర రావు, ఐ.ఎ.ఎస్. మేనేజింగ్ డైరెక్టర్

# ఇంటర్వ్యూ

పాలడుగు వెంకటేశ్వరరావు



ఆ రోజు ''కోణం'' పత్రికాఫీసు 'బిజీ'గా వుంది.

ఎడిటరుగారు తన గదిలో కూర్చుని స్క్రిప్టులు పరిశీలిస్తున్నారు. సబ్-ఎడిటర్ సూన్నాణ బాణం లాగ దూసుకుని వచ్చాడు. ఏమిటన్నట్టు తలెత్తి చూసారు ఎడిటరు గారు కళ్ళు టపటపలాడించి ఉషారుగా 'వాళ్ళు వచ్చారండి' అన్నాడు సూన్నాణ.

'ఎవరు వాళ్ళు ?!'

'కుమారి కాంచనమాలా, కుమారి కామాక్షీ! ఇంటర్వ్యూ పెట్టాంగదా ఇవాళ'

'వెరీ గుడ్! అవతల స్పేర్ రూంలో కూర్చోపెట్టే పని కానీండి. బిస్కెట్స్, టీ ఏర్పాటు చేసారా ?'

'ఫ్రూట్సు, కూల్ డ్రింక్సు అరేంజి చేసామండి. వేసవి కాలం గదా!'

'ఓ. కే డాష్ ఆన్. నెక్స్ట్ వీక్ ఇష్యూలో ఇంటర్వ్యూ వేస్తామని ఈ ఇష్యూలో ప్రకటన వేద్దామా మరి! మీరూ దగ్గరే కూర్చుని నోట్ చేసుకుంటారు గదా పాయింట్సు నీట్‌గా రావాలి ఆర్టికల్!'

'అలాగేనండి!'

'ఆఁ! ఆ తర్వాత — వాళ్ళిద్దరి ఫొటోలూ తీసుకోండి. మర్చిపోవద్దు.'

'ఓ కే సార్' సూన్నాణ వెళ్ళిపోయాడు. 'కోణం' పత్రిక ఎడిటరుగారు కాగితాల కట్టల్లో మునిగిపోయారు మరల.

కుమారి కాంచనమాల ప్రఖ్యాతరచయిత్రి. పుంఖాను పుంఖాలుగా ఆంధ్ర కోణం పత్రికలో పడిన ఆమె నవలలు కథలు అసంఖ్యాక పాఠకుల్ని అలరించి వదిలి పెట్టాయి. కుమారి కాంచనమాల రచనా ప్రాభవం గురించి రసవత్తరంగా వర్ణిస్తూ కుమారి కామాక్షి రాసిన ఉత్తరాల కుప్పలు అదే పత్రికలో పడి పాఠకుల్ని ఆలోచనా చరితుల్ని చేసాయి. అసంఖ్యాక పాఠకలోకం నుంచి దానిపైన అనేకమయిన ఉత్తరాలూ వచ్చాయి. పత్రిక సర్క్యులేషను పెరిగింది. అది ఇటీవల జరిగిన ఒక విచిత్రమయిన వాస్తవం. పత్రికల చరిత్రలో అపూర్వం. అందువలన సబ్ ఎడిటరు సూన్నాణకి ఒక ఆలోచన వచ్చి, ఎడిటరుగారికి ఒక ప్రపోజలు పెట్టాడు. పత్రికాఫీసుకి పిలిపించి కుమారి కామాక్షి చేత కుమారి కాంచనమాలని ఇంటర్వ్యూ చేయించి, దాన్ని వివరంగా పత్రికలో అచ్చొత్తించితే?! బాగానే వుంటుందని అనిపించడంచేత పోటనే ఎడిటరుగారు తన సమ్మతిని తెలియ జేసారు. ఆ వెంటనే రచయిత్రికీ, విమర్శకురాలికీ ఉత్తరాలు రాసిపడేశాడు సూన్నాణ.

అందువలన 'ఆ రోజు'న కుమారి కాంచనమాలను, కుమారి కామాక్షిని రిసీవు చేసుకుని ఆ విషయం ఎడిటరుగార్కి తెల్పి ఆ పనిమీదే అఘమేఘాలమీద వారి దగ్గరకి వెళ్ళాడు సూన్నాణ, తిరిగి బాణం లాగా.

సూన్నాణ వెళ్ళేసరికి సోఫాలో కూర్చుని వున్న కాంచనమాలా, కామాక్షీ సీరియస్‌గా తలలు వేళ్ళాడేసుకుని ఎడమొహం పెడ మొహం పెట్టి వున్నారు. అవతలగా కుర్చీల్లో కూర్చుని వున్న ఆ ఇద్దరు యువకులూ తెగ మాట్లాడేసుకుంటున్నారు.

సూన్నాణకి కలిగిన పరిచయభాగ్యం ప్రకారం అందులో ఒకాయన కుమారి కాంచనమాల అన్న; పేరు ఆదినారాయణ. రెండవవారు కుమారి కామాక్షికి తమ్ముడు; అతని పేరు అప్పారావు.

ఇంతలో ఫ్రూట్సు వచ్చాయి.

అవి కాళీ అయేసరికి కూల్ డ్రింక్సు వచ్చాయి.

అవీ పీల్చబడిన మరు క్షణం. 'ఇక ఇంటర్వ్యూ ప్రారంభిద్దామా ?' అని

అడిగాడు సూన్నాణ. అప్పారావూ, ఆది నారాయణా చిరునవ్వులు నవ్వారు.

'జస్ట్ వన్ వర్డ్ సర్' అని నవ్వులు చిందించాడు అప్పారావు.

'చెప్పండి' అంటూ నవ్వుల్లోనే బదులు తీర్చాడు సూన్నాణ.

'మా అక్క కామాక్షిగారు బహా భిడియస్తులు. అందుచేత ఆమె తరఫున నేను కుమారి కాంచన మాలని ఇంటర్వ్యూ చేస్తాను. మీరు కాదు కూడదు అంటే బ్యాడ్ ప్రెషర్‌తో ఆమె మూర్ఛపోయే ప్రమాదం వుంది. కనుక మీరు దయచేసి నా మాట కాదనరని ఆశిస్తాను ప్లీజ్!' అన్నాడు.

సూన్నాణ మొహంలో వుత్సాహం నీరు గారి పోయింది.

'ఏదో మీరు కేవలం ఆమెకి సాయంగా వచ్చారంటే నిజమే అనుకున్నాను గాని అది ఈ రకమయిన సాయం అనుకో లేదండి' అన్నాడు, విచారంగా.

'మరి ఇంతవరకు వచ్చాక తప్పేదేముం జాయింటుందండి' భయంకరంగా మొహం పెట్టి అన్నాడు ఆరడుగుల ఆదినారాయణ, బొద్దు మీసాల్ని సవరించుకుంటూ.

'అదేమిటండి ?'

'మా చెల్లెలు కుమారి కాంచనమాల మగవారితో మాట్లాడనని నియమం పెట్టుకుంది. అందువలన కామాక్షిగారి తరఫున అప్పారావు గారడిగే ప్రశ్నలకు కాంచన మాల తరఫున నేను సమాధానాలు చెప్పాల్సి వుంటుంది' ఖండితంగా అన్నాడు ఆదినారాయణ. కాగితాలు, కలం ప్రక్కన పెట్టాడు సూన్నాణ. ఇదేంటి ఇలాగ వుంది వ్యవహారం అనుకున్న సూన్నాణ తెల్ల మొహం వేసేడు. రచయిత్రినీ, విమర్శకురాల్నీ చూసాడు, నిశితమయిన దృక్కులతో. కాంచనమాలా, కామాక్షీ బిత్తర చూపులు చూస్తున్నారు.

'ఇదేం ఇంటర్వ్యూ, అండీ బాబూ !? చిత్రంగా వుంది' అన్నాడు సూన్నాణ.

'ఏం ? అలా అయితే ఇంటర్వ్యూ ఇవ్వించుకోదా ?' ఆదినారాయణ బింకంగా నిగ్గదీశాడు.

'సోన్లేండి. ఏలాగోలా అయిపోనీండి. ప్లీజ్' అన్నాడు అప్పారావు.

'సరే కానీండి.' అని తల పట్టుకుని మరుక్షణం కాగితం కలం అందుకున్నాడు సూన్నాణ, తిరిగీ. మగవాళ్ళిద్దరూ విజృంభించారు.

సుమారు అరగంటసేపు — నవలా సాహిత్యం మీదా కథానికా ప్రక్రియ మీదా అనర్గళంగా మాట్లాడుకున్నారు ఆదినారాయణా, అప్పారావూ. పాయింట్సు నోట్ చేసుకున్నాడు సూన్నాణ. అది జరుగుతున్నంత సేపూ సూన్నాణని ఒక ప్రశ్న పీడిస్తూనే వుంది. 'ఇక చాల్లెండి' అని వాళ్ళని ఆపి, 'ఇప్పటికే చాలా పొడుగుపాటి ఇంటర్వ్యూ అయింది. థాంక్సు. కుమారి కాంచనమాల గారూ ! ప్రస్తుతం మీరు ఏం రాస్తున్నారో మాకు చెప్తారండీ ?' అని ఆ అమ్మాయిని అడిగాడు సూన్నాణ.

కాంచన మాల బిక్క మొహం పెట్టింది.

'నన్నడగండి. నేను చెప్తాను. ప్రస్తుతం ఆమె 'అనంత వాహిని' పత్రిక వాళ్ళకోసం ఒక నవలా, 'అఖండం' పత్రిక కోసం రెండు నవలూ రాస్తూ వున్నారు. నిర్మాణంలో వున్న కథలు కోకొల్లలు.' అన్నాడాదినారాయణ, మొహం మీది చమట తుడుచుకుంటూ. సూన్నాణ బిక్క మొహం పెట్టాడు.







వండి. ప్లీజ్. ఈ ఒక్క విషయంలో మీరు సరేననాలి. ఈ విషయం బయటి వాడి కెవరికి తెలీదుగదా. అంతా మనమే నాయె.' అంటూ బ్రతిమిలాడాడు అప్పారావు.

'సరే కానివ్వండి' అంటూ కాగితం కలం చేతపట్టుకున్నాడు, సూన్నాణ.

'అప్పారావుగారి ఆ పాయింటికి నాదొక

# ఇంటర్వ్యూ

'కుమారి కామాక్షి గారూ! కుమారి కాంచన మాల గారి 'ఈదే బ్రతుకుల్లో తిగిరే చేపలు' నవల మేము వేసాము గదా. దాన్ని గురించి మీ అభిప్రాయం ఏమిటి?' అని ఆ అమ్మాయి వంక చూసాడు సూన్నాణ; కనీసం ఆవిడయినా నోటి ముత్యాలు రాల్చుతుందని. ఆ అమ్మాయి సిగ్గుపడి వంకర్లు తిరిగింది.

'అమ్మమ్మ. అది బ్రహ్మాండ మయిన నవలా రాజమండీ! పాఠకుల్ని 'ఆనంద రస వాహిని' లో నోల లాడించి 'పరిపూర్ణ తృప్తి'ని కలిగించింది గదా కుమారి కాంచన మాల గారి ఆ నవలా ఖండం! నిజంగా అది తెలుగు సాహిత్యాకాశంలో ధృవ తారగా పది రోజుల పాటయినా నిర్విరోగల సాహితీ గ్రంథం. అటువంటి నవలల్ని ప్రచురించి మీరు తెలుగు సాహితీ పరులకి చేస్తున్న సేవ అపారం, అనన్య సామాన్యం, అత్యద్భుతం. ఆ నవల అచ్చవుతున్నంత కాలం కుమారి కామాక్షి పూర్తిగా భోజనం మానేసిందంటే మీరు నమ్మాలి మరి!' తను జోక్యం కలిగించు కొని చిరునవ్వులు చిందిస్తూ అన్నాడు అప్పారావు.

సూన్నాణ తల బొప్పి కట్టినట్టయింది.

ఒంట్లో ఉషారు ఆవిరయి నీర్సం ఆవహించింది.

'సుందోప సుందుల్లాగ మీ రెక్కడ దొరికారయ్యా బాబులూ? అసలు—ప్రఖ్యాత రచయిత్రితోనూ, పేరు గొన్న విమర్శకురాలితోను నన్ను మాట్లాడ నీయరాయిరి! నేనేం చెయ్యాలి? ఉంది. ఇక్కడ ఏదో ఒక గొప్ప కీలకం ఉంది' అనుకున్నాడు సూన్నాణ, ఆలోచనలో పడ్తూ.

అంతలో ఫొటోగ్రాఫరు వచ్చాడు.

చక చకా ఫొటోలు తీసాడు. విడివిడిగా, జమిలిగా దిగిన ఆ ఫొటోల్లో ఆదినారాయణా అప్పారావూ కూడా దూరారు.

'మీ అందరికీ చాలా థాంక్సండీ. చాలా శ్రమపడి వచ్చి 'ఇంటర్వ్యూ' పూర్తి చేసారు. మా కోరికని మన్నించారు' అన్నాడు సూన్నాణ, భరత వాక్యం పల్కుతూ.

'ఆ. దాందేముందండీ, అది మా కర్తవ్యం. అన్నట్టు ఈవారం పత్రికలోనే 'ఇది' వేస్తుందాండీ?' అన్నాడు ఆదినారాయణ

'నా ఫొటోకి అవసరమయితే కాస్త టచప్ చేయించండి. అసలే నా రంగ బ్లాకు' అంటు సిగ్గుపడ్తూ అన్నాడు అప్పారావు.

సూన్నాణ తెల్లమొహం వేసాడు

అందరూ లేచారు.

'అప్పట్లు ఎడిటరుగారు వున్నారాండి?' అప్పారావు అడిగాడు.

'వున్నారండి.'

'వారితో కాసేపు మాట్లాడదామా' అని ఆదినారాయణ అన్న మీదట ఇక తప్పదన్నట్లు వాళ్ళని తీసుకొని నీర్సంగా ఎడిటరుగారి గదికి దారి తీసాడు సూన్నాణ.

ఎడిటరు గారి దగ్గర బైఠాయించి, ఆయన పని చెడగొట్టి, ఆయన్ని సుమారు గంటసేపు కబుర్లతో వూదరగొట్టి గాని అక్కణ్ణించి కదలేదు వాళ్ళు.

వాళ్ళని టాక్సీ ఎక్కించి వీడ్కొల్పాడు సూన్నాణ. అలాగ వాళ్ళని పంపించి తిరిగి వచ్చిన సూన్నాణని అడిగారు ఎడిటరుగారు.

'ఆ మగ వాళ్ళిద్దరూ ఎవరయ్యా? జిడ్డుల్లాగ వున్నారు?'

'సుందోప సుందులు' అని నాలుక కొరుక్కున్నాడు సూన్నాణ.

తెల్లపోయి చూసారు ఎడిటరు గారు.

'అంటే?!'

'బాడీగార్డు లండీ.'

'అలాగా!' అంటు పక పక నవ్వారు ఎడిటరు.

'నా ప్రాణం తీసి వదిలి పెట్టారయ్యా'!

'అది వాళ్ళ పనండి మరి.'

'అవునూ. ఒక చిత్రం గమనించావా?'

'లేదండి.'

'కుమారి కాంచనమాల అంతసేపూ నోరువిప్పి ఒక్క మాటా మాట్లాడలేదే! పోనీ కుమారి కామాక్షి అయినా నోరుతెరిచి ఒక్క మాట మాట్లాడుతుందనుకున్నాను నాతో. ఆవిడా బెల్లంకొట్టిన రాయిలాగ వుండిపోయింది. కారణం ఏమిటంటావ్?'

'మీరే చెప్పాలి!'

'అంటే?!! వార్నీ! నువ్వు భలేవాడివయ్యా. తల నెరిసిన నన్ను చూసి వాళ్ళ కెందుకయ్యా సిగ్గు ఒడియాలు? నేను నీ లాగ కుర్రాణ్ణి కాదుగదా!'

సూన్నాణ నవ్వుకున్నాడు.

'పోనె. ఇంటర్వ్యూ ఎలాగ వచ్చింది?'

'బ్రహ్మాండంగా వచ్చిందండి.'

'వెంటనే ఫినిషింగ్ టచస్ చేసి కంపోజుకి ఇచ్చెయ్యి. ఫొటోలు...?'

'తీయించామండి.'

'నువ్వు ఆ 'జాబ్'మీదే వుండు. ఈ ఇష్యూలో ప్రకటన వేసాము. నెక్స్ట్ ఇష్యూలో పాఠకులు వెతుక్కుంటారు గదా. పడక పోతే తెల్సుగా. ఉత్తరాల యుద్ధం ఎదుర్కోవాలి నువ్వూ - నేనూ.'

'అలాగేనండి.' అని తన గదిలోకి వెళ్ళి పోయాడు సూన్నాణ.

ఆ ఇష్యూ విడుదలవగానే ఉత్తరాల వర్షం ప్రారంభమయింది. వచ్చే వారం వచ్చే 'కుమారి కామాక్షి, కుమారి కాంచనమాలని చేసిన ఇంటర్వ్యూ వివరాల కోసం కళ్ళు కాయలు కాచేలాగ ఎదురుచూస్తూ వున్నా'మని అసంఖ్యాకులయిన పాఠకులు ఉత్తరాలు రాసారు.

మరో వారం గడిచింది; బిజీగానే.

అప్పుడే 'డిస్పాచ్' అయిన పత్రికని తెప్పించుకుని చూస్తూవున్న ఎడిటరుగారు ఉలిక్కిపడ్డారు!

చాలా కంగారుకి కూడా లోనయారు!

గుండె దడదడలాడుతుండగా, సూన్నాణని కబురు చేసారు!!

బాణం లాగ వచ్చాడు సూన్నాణ.

'ఏమిటయ్యా ఇది?' అన్నారు ఎడిటరు గారు కంగారుగా.

'ఏమిటి సార్?'

'ఇది చూడు'.

అది చూసిన సూన్నాణ నవ్వు నాపుకోన లేక పోయాడు.

పత్రిక మధ్య పేజీల్లో పెద్ద పెద్ద అక్షరాలలో 'ఇంటర్వ్యూ' అందంగా పడింది. కాని—

బుర్ర మీసాలతో కొట్టొచ్చినట్టుండే ఆదినారాయణ ఫొటో-

దాని ప్రక్కనే అప్పారావు ఫొటో పడ్డాయి.

ఆ ఆదినారాయణ ఫొటో క్రింద ప్రఖ్యాత రచయిత్రి కుమారి కాంచన మాల అనీ, అప్పారావు ఫొటో క్రింద ప్రఖ్యాత విమర్శకురాలు 'ఇంటర్వ్యూ చేసిన' కుమారి కామాక్షి అనీ పడింది!

పొట్ట చెక్కలయేట్టు నవ్వాడు సూన్నాణ.

ఎడిటరు గారు కూడా పక పక మని నవ్వాడు. కాని వెంటనే సీరియస్సయి—

'నవ్వులు బాగానే వున్నాయయ్యా, కాని ఇది ఎలాగ జరిగింది? రేపు నుంచి కుప్ప తెప్పలుగా వచ్చిపడే పాఠకుల వుత్తరాలకి ఏమని సమాధానం చెపుతావు? చిక్కులో పెట్టావు గదా' అంటు తల పట్టుకున్నారు ఎడిటరు గారు.

'చాల చిత్రమయిన గొడవతెచ్చిపెట్టావు గదయ్యా' అని గొణిగారు.

'దీనివల్ల ఏం ప్రమాదం లేదు సార్' అన్నాడు సూన్నాణ తాపీగా.

'ఎలాగ?'

'ఇటువంటిది తెలుగు పాఠకులు ఇది వరకు కనీవినీ ఎరుగరు. అందువలన ఇదొక కొత్త 'డిస్కషన్'ని తెచ్చి పెడ్తుంది; పాఠక లోకంలో.'

'ఆఁ'

'పాఠకుల్లో ఔత్సుక్యం పెరుగుతుంది.'

'అవును.'

'తర్జన భర్జనలు చేస్తారు. విమర్శలు ప్రతి విమర్శలు వస్తాయి. పత్రిక సర్క్యులేషన్ పెరుగుతుంది.'

'బాగానే వుందయ్యా. కాని ఈ గొడవని ఎలాగ సరి చేస్తావు? ఈ తల నొప్పిని ఎలాగ వదుల్చుకోవటం? సమాధానం ఏమని చెప్పటం?'

'ఆ గొడవని అలాగ కొన్ని వారాలు సాగనిచ్చి అప్పుడు ఒక 'గమనిక' అచ్చేద్దాం?'

'అదేమిటి?'

'ఇదుగో – రాసి రడీగానే వుంచాను చూడండి.'

అది అందుకొని చదివారు ఎడిటరుగారు.

'గమనిక. ఫలానా సంచికలో పడిన ఇంటర్వ్యూ ఫొటోల క్రింద క్యాప్షన్స్‌లో పొరపాట్లు దొర్లినాయి. కుమారి కాంచన మాల, కుమారి కామాక్షి గార్లకి బదులుగా 'ఇంటర్వ్యూ' వారి వారి ఘోస్ట్ రైటర్సు చేత జరుపబడింది. అందువలన ఆ ఘోస్ట్ రైటర్సు ఫొటోలు మాత్రమే ప్రచురిత మయినాయి. ఈ పొరపాటుకి చింతిస్తూ పాఠకుల్ని సహరించి చదువ కోరుతున్నాము. ఇక్కడితో ఈ విషయమై వుత్తర ప్రత్యుత్తరాల ప్రచురణని కూడా నిలిపి వేస్తున్నాము—ఎడిటర్.'

అది చదివాక పొట్ట చెక్కలయ్యేట్టు నవ్వారు ఎడిటరు గారు.

ఆ నవ్వుతో శృతి కలిపాడు సూన్నాణ

'అయితే ఆ సుందోప సుందులు 'భ్రాత రచయితల'న్నమాట నాకూ అప్పుడే అనుమానం వచ్చింది సుమా!'అన్న ఎడిటరు గారి మాటలకి తల వూపి 'ఇక, చూడండి తమాషా' అన్నట్టు కళ్లతోనే చెప్పి ఎడిటరు దగ్గర సెలవు తీసుకొని తన గదిలోనికి వెళ్ళిపోయాడు సూన్నాణ

ఇక రాబోయే వుత్తరాల కట్టల్ని అందు కోటానికి తానూ సిద్ధంగానే వున్నట్టు "కోణం" పత్రికాఫీసు బిజీగా అయింది



తాజా వార్తలకు, వ్యాఖ్యలకు, కొంగ్రొత్త ప్రత్యేక శీర్షికలకు ఆంధ్రపత్రిక దిన పత్రిక పెట్టింది పేరు...మీరు మీ కాపీ మీ ఊరి ఏజెంటుద్వారాగాని లేదా మానేజరు, గాంధీనగరం, విజయవాడ-3 లేదా మానేజరు, బషీర్‌బాగ్, హైద్రాబాద్-29 కి గాని వ్రాసి పోస్టులో తెప్పించుకొనండి.

# ధ ర్మ ప థం

## తలిదండ్రుల సేవ

మానవులు చేసిన పాపాలు పుణ్య నదుల్లో స్నానం చెయ్యడంవల్ల పోతాయని అందరికీ తెలుసును. ఆ పాపాలు మనలను విడిచి ఆ నదులకు సంక్రమిస్తాయి. ఆ కారణం వల్ల గంగా యమునలకు పిశాచ రూపం వచ్చింది. ప్రయాగలో త్రివేణీ సంగంలో జనం స్నానం చేయడమే నదులకు పిశాచ రూపం రావడానికి హేతువు.

ఆ రెండు నదీ దేవతలూ ఆ సమీపంలో ఉన్న, కుక్కుటముని ఆశ్రమానికి పోయి ఆ శ్రమ ప్రాంగణాన్ని పరిశుభ్రంగా తుడిచి తమ పిశాచ రూపాన్ని పోగొట్టుకొని దివ్య జ్యోతితో వెలుగుతూ వెళ్ళిపోయాయి. తీర్థ యాత్రలుచేసి పుణ్యం సంపాదించి ముక్తి పొంద దలచిన హరిదాసు ఆ సమయంలో ఆ ఆశ్రమంలో ఉండడం తటస్థించినది. అతను ఈ సంఘటనను చూచి, ఆ ముని మహిమను ఆశ్చర్యపడి "స్వామీ! భూతాలను జ్యోతి స్వరూపులుగా చేసే మహిమ కలగడానికి మీరెంత గొప్ప తపస్సు చేశారో?" అని ప్రశంసించాడు. దానికి కుక్కుటముని చిరునవ్వు నవ్వుతూ "అయ్యా. నేను సామాన్యుడనేకాని గొప్ప శక్తి కలవాడను కాను. నే నెట్టి మహా తపస్సు చెయ్యలేదు. నేను చేస్తున్న అదేదో చూపుతాను. లోపలికి రా" అని కుటీరంలోనికి తీసుకొని పోయాడు. అక్కడ శత వృద్ధులైన అతని తలిదండ్రులు కూర్చుని ఉన్నారు. వారిని చూపుతూ "వీరిని సేవించడమే నేను చేస్తున్న గొప్ప తపస్సు. వీరికి ఏ లోటూ లేకుండా చూచుకుంటున్నాను. వీరి అనుగ్రహం వల్లనే నా ఆశ్రమానికి యిలాటి శక్తి కలిగింది" అని చెప్పాడు.

ఆ మాట విని హరిదాసు నిశ్చేష్టుడై పోయాడు. తలిదండ్రుల సేవకంటె మరొక గొప్ప తపస్సు లేదని గ్రహించాడు. అతడు

## కొత్త గవర్నర్ శ్రీ అబ్రహామ్ :—

ప్రముఖ కేరళ కాంగ్రెస్ నాయకులు శ్రీ కె. సి. అబ్రహాం అగస్టు 14న రాజ్‌భవన్‌లో నూతన గవర్నర్‌గా ప్రమాణ స్వీకారం చేశారు. రాష్ట్ర ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివరావు ప్రమాణస్వీకారం చేయించారు. శ్రీ అబ్రహాంకు ముఖ్యమంత్రి, తదితరులు అగస్టు 14 ఉదయం నాంపల్లిస్టేషనులో ఘనస్వాగతమిచ్చారు. గుజరాత్ గవర్నర్‌గా బదిలీ అయిన శ్రీమతి శారదముఖర్జీ అగస్టు 11వ తేదీన ముఖ్యమంత్రి ఏర్పాటుచేసిన వీడ్కోలు విందులో ప్రసంగిస్తూ, రాష్ట్ర సమస్యల పరిష్కారంలో గవర్నర్‌కు ముఖ్యమంత్రికి సన్నిహితావగాహన వుండాలని సూచించారు. గవర్నర్ "నామమాత్రం"గా వుండనవసరం లేదని రాష్ట్రాభివృద్ధికార్యక్రమాలలో చురుకుగా పాల్గొనాలని ఆమె అన్నారు.

## నగ్నముని కేశవరావ్ :—

"విశ్వశ్రేయః కావ్యం అని అరుస్తూ
ప్రబంధనాయిక తొడలబంధనాలలో
పాదాలకు పూసుకొని ఎగిరే లేపనాలలో
అంటుకున్న కవిత్వం అబద్ధం.
తపస్సుచేయడానికి వెళ్లవలసింది
హిమాలయాల్లోకి కాదు
జనంలోకి."

అంటాడు నగ్నముని కేశవరావు. కేశవరావు దిగంబర కవులలో ఒకడు. అసత్యాన్ని, అన్యాయాన్ని నగ్నంగా బట్టబయలు చేయడం పెట్టినవాడు. సత్యాన్ని ఉన్నదున్నట్టుగా, యథాతథంగా చెప్ప సాహసించినవాడు గనుక నగ్నముని అయ్యాడనుకుంటాను. "దిగంబరోద్యమం మానసిక స్థితి. పరిస్థితి సరిగాలేనంత వరకు ఆ ఉద్యమం వుంటుంది." అంటాడు నగ్నముని. తెలుగుదేశసాహిత్యచరిత్రలో నాలుగు ట్రాజెడీలు జరిగాయంటాడు ఆయన :— (1) 11వ శతాబ్ది వరకు మనకు సాహిత్యం లేకపోవడం. (2) 11వ శతాబ్దంనుంచి అరంభమయిన సాహిత్యం అనువాదాలతో ఆరంభంకావడం. (3) 19వ శతాబ్దం వరకు ప్రజలసాహిత్యంవైపు ఎవరికీ దృష్టి లేకపోవడం. (4) గురజాడ, కందుకూరి, గిడుగు సాధించినవి నిరంతరాయంగా కొనసాగక పోవడమూను. జాతీయోద్యమం, గురజాడ ఉద్యమం ఏకకాలంలోనే జరిగాయని, అందువల్ల కలిగిన ఫలితాన్ని అభ్యుదయ కవులు కొంత గ్రహించి ముందుకుసాగినా, వారిలో ఒకానొక దశలో స్తబ్ధత ఏర్పడిందని, ఆ స్తబ్ధతను దిగంబరకవులుతొలగించి కవితావేశాన్ని ముందుకు లాగుతున్నారని, ప్రజాకళా రూపాలు రావాలని అంటారు నగ్నముని. "ప్రతిరచయితా, తాను ప్రజలవైపో, ప్రజాపీడకులవైపో స్పష్టంగా తేల్చుకోవాలి. రచయితస్వంతగొంతుకతో పతక లేదు" అంటారునగ్నముని. "సాహిత్యం పేరుతో సంస్థలు ఏర్పడుతున్నాయేగాని, సాహిత్యం ముందుకుపోతున్నదా అనే సంగతి చూడాలి. ఆ సాహిత్యసంస్థలలో అధ్యక్షుడు, కార్యదర్శి కొట్టుకోడం, ఆ గుడిగుడి గుంచంతోనే అధికారదాహం. దిగంబర కవులకు అలాటిదిలేదు. ప్రజలలోకి వెళ్ళడానికి సంస్థ పేరుకావాలి. సంస్థలో పదవులలో అవసరం ఏముంది? పనిముఖ్యం. పని లేని ప్రసంగాలు ఎక్కువవుతున్నాయి." అనివివారం ప్రకటించాడు ఆయన 1940లో తెనాలిలో జన్మించారు నగ్నముని. 1956లో తెలుగుస్టెనోగా విధానసభలో చేరారు 1962లో కేశవరావుగా "ఉదయించని ఉదయాలు" తొలికవితా సంపుటి ప్రచురించారు. 1965 వరకు వివిధ కవితలూ, కథలు, రేడియోనాటికలు మున్నగునవిరచించారు. 1965లో దిగంబర కవితోద్యమాన్ని మరో అయిదుగురు యువకవులతో ప్రారంభించారు. 1971లో కవితల సంపుటి "తూర్పుగాలి" 1972లో 'నగ్నముని కథలు' పేరిట కథానికసంపుటి ప్రచురించారు. 1964లో మాలపల్లి నవలను నాటకీకరించారు; వివిధ పత్రికలలో కథలు, కవితలు మున్నగునవి రచించారు. 1975లో ఇప్పటికీ జనసంస్కృతికి ప్రతిబింబాలు కావడంతో శ్రీశ్రీతోపాటు అరెస్టయ్యారు. 1976 జూన్ నెలలో విధానమండలి విలేఖరి పదవినుంచి డిస్మిస్ చేశారు. అత్యయిక పరిస్థితిలో 18 నెలల పాటు అయనను పోలీసులు వదలలేదు, వెంటాడారు. ఈ అత్యయికపరిస్థితిలో "5 విలోమ కథలు" అనే పేర ప్రయోగాత్మక కథలు వ్రాశారు. ప్రచురించారు. అత్యయిక పరిస్థితితొలగినతర్వాత 1977 జూన్‌లో అయనను మరల ఉద్యోగంలో

# హైదరాబాద్ నోట్ బుక్



గవర్నర్ శ్రీ కె. సి. అబ్రహాం

---

వృద్ధులైన తలిదండ్రులకు సేవ చెయ్యకుండా, వారి మాటను లక్ష్యపెట్టక పుణ్యం సంపాదించడానికి తీర్థయాత్రలకు బయలుదేరాడు. తాను చేసిన తప్పు గ్రహించి, పశ్చాత్తప్తుడై మరి ముందుకు ప్రయాణం సాగించక వెనుకకు మళ్ళి ఇల్లు చేరుకున్నాడు. తలిదండ్రుల పాదాలపైపడి తన తప్పు క్షమించాలని వేడుకున్నాడు. వారి సేవకంటె జన్మను తరింపజేసే పుణ్యకార్యం మరొకటి లేదని గ్రహించి వారి సేవ చేసి కృతార్థుడైనాడు. ఆ పుణ్యం వల్ల మహాభక్తుడైన పుండరీకుడయి, భగవత్సాక్షాత్కారాన్ని పొందాడు

— బులుసు వేంకటరమణయ్య



# హైదరాబాద్ నోట్ బుక్

నియమించారు. ఈ సంవత్సరం జనవరి నెలలో వ్రాసిన "కొయ్యగుర్రం" (తుఫాను వ్యవస్థమీద కవి కన్నీరు) కావ్యాన్ని రష్యన్ భాషలోకి ప్రొఫెసర్ ఎస్.వి. గురొవ్ అనువదించారు. మాండలికాలు ఏ భాషకైనా అందాన్ని చేకూరుస్తాయని నగ్నముని అభిప్రాయం. "తెలుగు ఇంతగా, ఇన్నిరూపాలలో వుండడం ఎంతగొప్ప అని మనం ఆనందించాలి" అంటారు నగ్నముని. దేశంలోని మోసంగురించి ఆయన ఆవేదన వర్ణనాతీతం. "మనదేశదౌర్భాగ్యం అమాయిక ప్రజపైవారిమోసం. గ్రహించకపోవడం. మన దేశంలో రాజకీయనాయకునికి ఎక్కువ ప్రాధాన్య మిచ్చి, నెత్తిన ఎక్కించుకొన్నాము. ప్రతివారూ అనధికార చేష్ట చేస్తారు. ఆర్థికశాస్త్రజ్ఞుడు అర్థ శాస్త్రం గురించి మాట్లాడడు. రాజనీతిజ్ఞుడు రాజ కీయ వ్యవస్థను గురించి మాట్లాడడు. సాహిత్య వేత్త సాహిత్యం గురించి మాట్లాడడు."

"కొత్తకలలో కొత్తవిశ్వాసాలతో
విశ్వవస్త్రంనేసి,
తిరిగొచ్చి.
దిసమొలగా దిక్కుల మధ్య
దిక్కు లేకుండా పడివున్న
మనిషి ఒంటిపై కప్పుతాను."
ఇదీ నగ్నముని జీవితాశయం.

డాక్టర్ బోయి భీమన్నకు సన్మానం :

సుప్రసిద్ధ కవి, రచయిత, నాటకకర్త పద్మశ్రీ కళాప్రపూర్ణ, డాక్టర్ బోయి భీమన్నను విధాన పరిషత్తు సభ్యుడుగా నియమితు డయినందుకు సనత్ నగర్ సాంస్కృతిక సంఘం, నటరాజ సాంస్కృతిక కళాసమితి సంయుక్తంగా జులై 26 వ తేదీన సంగీత నాటక అకాడెమి హాలులో సన్మానించాయి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావు అధ్యక్షత వహించారు. శ్రీ భీమన్న 1947లో జాన పదుని జాబులు వ్రాస్తున్నప్పటి నుంచి నాకు తెలుసు సాహిత్య బంధువుగా. తర్వాత 1951 లో కవిసమ్మేళనంలో తొలిసారిగా చూచాను. సాహిత్య రంగ అర్ధశతాబ్దిగా నిలబడి వున్నారు స్పష్ట మైన దృక్పథం, లక్ష్యం వున్నవారు. ఏవో రాజ కీయాలకు కట్టుబడి అడుగులకు మడుగులొత్తే వారు కారు. ధైర్యం, చిత్తశుద్ధి కలవారు. ఇప్పుడు పరిపక్వ దశలో వున్నారు. కనుక విశ్వకల్యాణోపయుక్తమైన రచనలు ఇంకా చేయాలని కోరుతున్నాను అని శ్రీ రామానుజ రావు అధ్యక్షభాషణంలో అన్నారు. ఆంధ్రప్రదేశ్ సాంస్కృతికశాఖ ప్రత్యేకాధికారి డాక్టర్ అంతటి నరసింహం ప్రసంగిస్తూ, మానవుడు మానవుడుగా చూడబడని మనదేశంలో శ్రీ భీమన్న వంటి వారు పైకి రావడం కష్టమన్న, ఇలాంటి సంఘాన్ని సంస్కరించడానికి శ్రీ భీమన్న 25 సంవత్సరాల క్రితం డాక్టర్ భీమరావు అంబేడ్కర్ పేర 'భీమ సేన' అనే స్వచ్ఛంద సేవాదళం ప్రారంభించారని నేడువిధానపరిషత్తుకు నామినేట్ అయారని అన్నారు. ఆంధ్రప్రభ ఉప సంపాదకులు శ్రీ ఎల్లోరా మహోద్రేకంగా మాట్లాడుతూ, శ్రీ భీమన్న పెన్నును గన్నుగా వాడిన మహా రచయిత అని, ఆయన వ్రాసిన పాలేరు నాటకం ఉభయ గోదా వరి మండలాలలో విప్లవం తెచ్చిందని, ప్రశంసించారు. ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రం ప్రొడ్యూసర్ శ్రీ ఎస్. బి. ఎస్. ప్రసాద రావు ప్రసంగిస్తూ, శ్రీ భీమన్న పరిచయం ఉమ్మడి మద్రాసు మంత్రి శ్రీ వేముల కూర్మయ్య ఇంట్లో 1947 లో జరిగినప్పటి నుంచి ఏర్పాటు. ప్రసాదం, ధర్మవ్యాధుడు మొదలయిన నాటకాల ద్వారా పరస్పర మైత్రి ఏర్పడిందని, అన్నారు. శ్రీ భీమన్న సమాధానం చెబుతూ "నాది సరస్వతీ నియోజకవర్గం, అంటే నేను విధాన పరిషత్తులో సాహిత్యానికి ప్రతినిధిని. నేను సానుభూతులను, అభినందనలను ఆహ్వానంగా స్వీకరిస్తుంటాను. శివ సరస్వతులు (శివశక్తులు)



నాకు ఇష్టం. 1952 లో నేను రాజోలు నియోజకవర్గం నుంచి ఉమ్మడి మద్రాసు శాసన సభకు పోటీ చేశాను. అప్పుడు గెలిచి వుంటే మంత్రి నయ్యేవాడిని. కాని నాశనం అయిపోయి వుండే వాడిని. ప్రజాసేవ, సారస్వతసేవ వుండేవికావు అన్నారు.

ఉపశ్రుతి :—

వెంకటాద్రి ఎక్స్‌ప్రెస్ నత్తనడకలు నడుస్తున్నది. 10 ఏళ్ళ కాంతి అన్నది- ఏంటినాన్నా ఈ ఎక్స్‌ప్రెస్ ఇలాపోతూంది,-అని. ఎనిమిదేళ్ళ నవీన్ అన్నాడు- క్రమంగా వేగం అందుకుంటుంది-అని. ఆరేళ్ళ రవి అన్నాడు-వేగంగా వెళ్ళితే ఎక్కడ జరిగిపోతుందేమోనే:అని. వీరు ముగ్గురూ డాక్టర్ ఎస్. ఆర్. విద్యాసాగర్ (ఉస్మానియావైద్యశాల) పిల్లలు.

— తిరుమల రామచంద్ర.



శ్రీ కోకా రాఘవరావు బృందంవారు జూలై 29వ తేదీన శ్రీ ఎం. పంచనాదం సన్మాన సందర్భంగా ప్రదర్శించిన కృష్ణ తులాభారంలో శ్రీ కోకా రాఘవరావు కృష్ణపాత్రధారి (మధ్యన నిలుచున్నవారు) ఎడమవైపు శ్రీ ఎం. పంచనాదం, కుడివైపు సన్మానపత్రం సమర్పిస్తున్న రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ ఎ. జె. నాయుడు



1978 దీపావళి కథల పోటీ
ముగింపు తేదీ 16-9-'78 శనివారం.





















# ఫాలాక్షుని డైరీ

(46 వ పేజీ తరువాయి)

### శశికపూర్ భార్యా విధేయత !

రాజ్‌కపూర్ నిర్మించిన సత్యం, శివం సుందరం సినిమా ప్రివ్యూకు హాజరపడానికి నటుడు, ఆ సినిమాలో కథానాయకుడూ అయిన శశికపూరు సింగపూరులో తాను అట్టెండవుతున్న వో అవుడ్డోరు షూటింగు నుంచి హెలికాప్టరులో విమానాశ్రయానికి వచ్చి. అక్కడ్నుంచి విమానంలో బ్యాంగ్ కాక్ వెళ్ళి, అట్నుంచి బొంబాయి విమానంలో చేరి, బొంబే విమానాశ్రయం నుంచి నేరుగా కారు డ్రయివు చేసుకుంటూ ప్రివ్యూ థియేటరు చేరుకొని "హియరమామ్" అన్నాడట. ఎందుకింత హైరాణ అని అడిగితే తాను ప్రివ్యూకు నిశ్చయంగా వస్తానని సినిమా నిర్మాత, దర్శకుడూ అయిన తన అన్న రాజ్‌కపూరుకు మాటివ్వడం ఒక కారణం, ఆర్. కె. బ్యానరులో తాను నటించిన మొదటి సినిమా అవడం కనుక తాను మనసారా ప్రివ్యూకు హాజరయి తీరాలనుకోడం రెండో కారణం అని అన్నారట. శశికపూరు షూటింగ్ అయ్యాక ఒక్కక్షణం కూడా అక్కడుండక పరుగులెట్టుకుంటూ యింటికి వెళ్ళిపోతారట. ఏదైనా తినడం, తాగడం వంటివి వచ్చినా, అనుకున్నాకన్నా పొకచోట ఎక్కువ కాలం వుండాల్సి వచ్చినా "మా ఆవిడకు కోపం వస్తుంది, ఎక్స్యూజ్మీ" అనేస్తారట. భార్యకింత దాసోహమా అంటే నవ్వేసి "కుటుంబ కట్టుబాటులో ఒకరిని ఒకరు గౌరవించుకోడం, కుటుంబాన్ని ఆనందమయం చేసుకోడాన్ని భార్యా దాసోహ మనుకుంటే నేనేమి అభ్యంతరం చెప్పను" అంటారటాయన. శశికపూరు క్షవరం చేయించుకోడానికే బార్బరు షాపుకూ వెళ్ళడం గాని, ఏ బార్బరూ ఆయనింటికి పోవడంగానీ జరుగదుట. కారణ మేమిటంటే ఆయన భార్యకో కళ వచ్చునట. ఆమె ఆయనకు హెయిర్ డ్రెస్సరట.

### ఛంబల్ లోయ దొంగల రాణి వధ

ఛాంబల్ వేలీలో గజదొంగల ముఠా నాయకురాలు, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్ ప్రజలను, పోలీసునూ గజ గజ లాడించిన హసినా బేగమ్‌ను మే 27 వ తేదీన ఉజర్ ఖిరియా అనేచోట ఉత్తరప్రదేశ్ పోలీసులు చంపేశారట ఆ క్రితం రోజు రాత్రి వో దోపిడి చేసి, 27 వ తేదీన ఆమె తన అనుచరులతో విశ్రాంతి తీసుకుంటుండగా పోలీసులా ప్రదేశాన్ని చుట్టుముట్టి, హసినా బేగం తన ముఠాతో లొంగిపోయినా, నిర్దాక్షిణ్యంగా దారుణంగా, క్రూరంగా పోలీసులు ఆమెను చంపేశారట. ఆమె అరునెలల గర్భిణట. వివస్త్రను చేసి ప్రజల ముందు ఆమె శవాన్ని పోలీసులుంచారట. ఆమె వయస్సు26 ఏళ్ళట ●



**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**


పక్కింటి పార్వతి బోలెడు
ఖర్చు పెట్టి ఇంటికి ఎమల్షన్
పెయింటు వేయించింది.
కాని నేను ఖర్చులో
20% పైగా ఆదా చేశాను.
సూపర్ డెకోప్లాస్ట్—
ఎమల్షన్ సౌందర్యానికి
పెట్టింది పేరు
asian paints
SUPER DECOPLAST
WATER THINNABLE INTERIOR/EXTERIOR WALL PAINT
"పార్వతి నన్ను అడిగుంటే ఆమె కూడా ఆదా చేసేది.
మా ఇళ్లు 120 చ. మీ. వైశాల్యంతో ఒకేలా
ఉంటాయి. అందంగా కన్పిస్తుందని, ఇంటికి ఎమల్షన్
పెయింటే వేయిద్దామని ఇద్దరమూ అనుకున్నాం.
వేయించాం కూడాను. కాని, ఆమెకు బోలెడు ఖర్చయింది.
నాకు మాత్రం 20% పైగా ఆదా అయింది.
ఎలా అంటారా, అది సూపర్ డెకోప్లాస్ట్ మహత్యం!"
సూపర్
డెకోప్లాస్ట్
ఏషియన్ పెయింట్స్



ROOPASH
Multi Purpose
SANDAL WOOD
POWDER
Mfd. by: VIJAYA CHEMICAL
ROOPASH
AMLA
BRILLIANTINE
రాగరంజితం, మనోరంజిత
మైన మీ మనసుకి, నిత్య
నూతనత్వంకోరే మీ వయ
సుకి, అందమైన మీ చర్మ
రక్షణకు
రూపాష్
శాండిల్ వుడ్ పౌడర్లనే
వాడండి
నిండుగా ఒత్తుగా నల్లని
తల వెంట్రుకలకు అహ్లాద
కరమైన చల్ల దనమునకు
ఆకర్షణీయమైన సుగంధ
సౌరభమునకు రూపాష్
అమ్లా బ్రిలియంటైన్
వాడండి.
విజయ కెమికల్ & టాయిలెట్ వర్క్స్ (తెలంగాణా)
మద్రాసు-7వారి మరియొక అత్యుత్తమమైన తయారి
ఆంధ్ర, ఒరిస్సా రాష్ట్రములకు స్టాకిస్టులు, డిస్ట్రిబ్యూటర్లు కావలెను....